తప్పు చేసిన వారిని శిక్షించడమా
లేక మన్నించడమా
యేది వుత్తమ మార్గం
ప్రసాద్
నిరూపిస్తాడు...

పద్మశ్రీ వారి

# సిరిసంపదలు

నిర్మాత
వి. వెంకటేశ్వర్లు, బి.ఏ.

దర్శకుడు
పి. పుల్లయ్య, బి.ఏ.



TARAKA

ఆంధ్ర, సీడెడ్.. విజయా రిలీజ్... నైజాం, మైసూర్.. ఈస్టిండియా రిలీజ్..




*ఇదంతా ఎలా?* నేషనల్ అండ్ గ్రిండ్లేస్ బ్యాంకులో డబ్బు దాచుకున్నాడు. గోవింద్ మొదట 5 రూపాయలతోనే ఆ బ్యాంకులో సేవింగ్స్ ఖాతా ప్రారంభించుకున్నాడు. అతని డబ్బు సురక్షితంగా వుండడమేగాక పాలీనా నూటికి 3 రూపాయలు వడ్డీకూడా లభించింది. ప్రతి నెలా ఎంత మిగుల్చుకొనగలిగితే అంతా ఆ బ్యాంకిలో గోవింద్ దాచుకొనేవాడు. కాగా క్రొద్దికాలంలోనే అది పెద్ద మొత్తమైంది. అతడు తెలివైనవాడు. భవిష్యత్తుకు, తన కుటుంబానికి, మున్ముందు సౌఖ్యం అనుభవించడానికిగాను అతడు దాచుకొనడం ప్రారంభించాడు.

## మీ కుటుంబంకొరకై డబ్బు దాయాలని మీ రెన్నడైనా ఆలోచించారా?

# నేషనల్ అండ్ గ్రిండ్లేస్ బ్యాంక్ లిమి.,

యునైటెడ్ కింగ్‌డమ్‌లో ఇన్‌కార్పొరేట్ చేయబడింది — మెంబర్ల బాధ్యత పరిమితం

బ్రాంచీలు: మద్రాసు: 3, నార్త్ బీచ్ రోడ్డు: 378 నేతాజి సుభాస్ చంద్రబోస్ రోడ్డు, (లాయిడ్స్ బ్రాంచి): 6, ఆర్మీనియన్ స్ట్రీట్: 158, మౌంట్ రోడ్డు. హైదరాబాద్: అబీడ్ రోడ్.

NGB/65-TEL

# ఉత్తరాలు

## ము ఖ చి త్రం

ఈవారం వారపత్రిక ముఖచిత్రములో నూతన నటి వాసంతి గడ్డముపై చుక్క ఉన్నది. ఈ చుక్క ఆమెయొక్క పుట్టుమచ్చా లేక మీ అచ్చులోని మచ్చా?

ఎ. వేణుగోపాల్‌రెడ్డి (కంచనపల్లి)

అచ్చు పుట్టుమచ్చ.

## క థ

ఆర్. సీతారాంరావుగారు వ్రాసిన "గ్రుడ్డివాడు" కథ నా కెంతగానో నచ్చింది. వారి కథ నా హృదయాన్ని కదలించింది. ముఖ్యముగా కన్నులు పోడిచినపుడు సారథిని చూచి అందరూ ఏహ్య భావముతో చూడటము, అందుకు అతని మనస్సు ఆందోళన, తరువాత చేసిన తప్పుకు శిక్షగా కండ్లలో జిల్లేడు పాలు పిండుకోవటము శ్రీనివాసరావు పిచ్చిగా "సారథి! నీ శీనుకు కండ్లు పోలేదు. నేనే మీ శీనును" అని అరవటము మొదలగు విషయములు కన్నులకు కట్టినట్టుగా ఉండి నా హృదయమును కరగించినది.

ఇటువంటి అమాయకపు జీవుల కథలను యథార్థ ధోరణిలో వ్రాసినందుకు వారికి, నా ధన్యవాదాలు.

వగడాల రామకృష్ణ (తనకల్లు)

## సీరియల్ కథ

ఈ వారం పత్రికలో ఒక క్రొత్తదనము కన్పించుచున్నది. శ్రీమతి కోమలాదేవిగారు వ్రాసిన "బంగారు పంజరం" అను క్రొత్త సీరియల్ ఈ పత్రికకే వన్నె తెచ్చినది.

కొం. త్రివాధరావు (నిడదవోలు)

## ఆ త్మ క థ

మారిలిన్ మన్రో ఆత్మకథ "మమత ఎరుగని జీవితం" చదువుతూంటే హృదయం కరిగిపోతూంది. హఠాత్తుగా "నశేషం" అన్న మాట కనిపించింది. బాధ ఎక్కువైంది. భారంగా ఉంది.

జి. లలిత (హైదరాబాదు)

## క్రొ త్త శీ ర్షి క

"వివిధ ప్రాంతాల వింత ప్రదేశాలు" అనే శీర్షికను, "ప్రపంచ ప్రముఖులు" అనే శీర్షికను ఒకే కాగితములో ఇరుప్రక్కల ప్రచురించమని నా మనవి. ఈవిధంగా చేసిన ఎడల, ఈ రెండు శీర్షికలను పుస్తకముగా తయారుచేసుకొనుటకు వీలు కలుగుతుంది.

కె. శ్రీకృష్ణమోహనరావు (హైదరాబాద్)

* * *

14—9—62 తేదీ సంచికలో యువ ప్రపంచం శీర్షిక క్రింద విసుగూ—విద్యార్థి ! ఏదో కొత్త విసుగ్గా ఉండి చదివాను. అంతా నన్ను గురించే వ్రాశారా అనిపించింది. నాలాంటి విసుగు మనుష్యులుండరేమో అనుకున్నాను. కాని ఇప్పుడే తెలుసుకున్నాను నాకు చాలామంది మిత్రులున్నారని.

పి. ఎస్. ఎన్. మూర్తి (చిలకలపూడి) ★

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు


## విషయానుక్రమణిక


శుక్రవారం : 28-9-62

శుభకృత్ సం॥ భాద్రపద మా॥ బ॥ అమా॥

సంపుటము : 55 సంచిక : 4

స్థాపితము :
1908

*

ముఖ్యసంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఒక సంవత్సరం చందా
వివరాలు

ఇండియా : రూ. 13.00 ఇతర దేశాలు : ఓడమీద ( Sea Mail ) రు. 20.00. (విమానంద్వారా (Air Mail ): బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ. 114.00. అమెరికా రూ. 176.50. ఆస్ట్రేలియా: 135.00.)

విడిప్రతి : 25 న.పై.

సంవత్సర చందా : 13-0-0.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి, మద్రాసు-1




"ముహూ-నేనా"లో దేవిక

## లోకంపోకడ



"అయ్యా! ఏం చెప్పమంటారు నా అవస్థ! రెండు ఆపరేషన్లు చేశారు! ఒకటి కడుపులోని వ్రణానికి! అప్పుడు ఆ వైద్యుడుగారు నా కడుపులో కత్తెర వదిలేశార్ట! అందుకని రెండోసారి శస్త్రచికిత్స చేశారు!"



(లోపలి కవరుపేజీ బొమ్మ : ఆర్. ఆర్. చిత్రంలో బి. సరోజాదేవి).


మన సరిహద్దు బలగాలను చైనా తోసిరాజనలేదు.
బాప్ రే!.. ఎలావచ్చారు చెప్మా?
కత్తీ తుపాకీ ఏదీ వాడకుండా దాన్ని వెనక్కి నెట్టేయాలి.
నాకేం.. కామన్వెల్తు అండదండలు వున్నాయ్...
కామన్వెల్తు
సమిష్టి విపణిదారి
రెండేళ్లకు పూర్వమే శ్రీశైలం నివేదికను సమర్పించుకున్నాం స్వామీ!
శ్రీశైలం నివేదికను వాళ్లు ఇంకా దాఖలు చేయరెంచేత?
కేంద్రం

వివిధ ప్రాంతాల వింతప్రదేశాలు

# బెర్ముడా దీవుల్లో సైనికోత్సవాలు!



'బెర్మ్యుడా' దీవుల్లో ఏటా జరిగే సైనికోత్సవాలు చాలా వేడుకగా కనుల పండువుగా ఉంటాయి అసలా వేడుకలను బెర్ముడా, స్కాట్లండ్, ఇంగ్లాండ్‌లనుంచి సంతరించుకున్నది. ఈ వేడుకలను 'టాట్ టూ' అంటారు. ఏటా జరిగే ఈ సైనిక ఉత్సవాలు బహు సంబరంగా ఉంటాయి. ఇందులో రకరకాల సైనిక కవాతులు, విన్యాసాలూ ఉంటాయి. వీటికి దోహదంగా సైనిక వాద్యవిశేషాలు, సన్నాయి, బ్యాండు మేళాలు, దీపాల తోరణాలు ఉంటాయి.

గంభీరంగా ఉండే రాత్రిని చీలుస్తూ అద్భుతంగా జరిగే ఈ వేడుకలను ప్రజలు విస్తుబోయి విరగబడి చూసి ఆనందిస్తారు. మొదట పెద్ద కాగడాల వెలుగులో ప్రారంభించిన ఈ సంబరాలు, అటు తర్వాత సెర్చిలైట్ల బ్రహ్మాండమైన వెల్తురులో జరుగుతాయి.

ఈ సైనికోత్సవం ప్రతీ వసంత కాలంలోనూ ఒక ప్రత్యేక ఆకర్షణ. ఇందులో అమెరికా వారి తరఫున కూడా ఒక ప్రాతినిధ్య సైనిక పటాలం పాల్గొంటుంది. ఇంకా ఇంగ్లాండ్, కెనడా, బెర్ముడాలు ఇందులో పాల్గొంటాయి. అంతా చూడముచ్చటగా ఉంటుంది.

అసలీ పిస్కోలు వేడుకలు ఇలా ఎలా తయారయ్యాయో? అంటే దానికో కథ వున్నది.

పదిహేడో శతాబ్దంలో ఇది ప్రారంభమైందంటారు. బ్రిటిషు సేనలు హాలెండులోను, బెల్జియంలోను విడిసి ఉంటూఉండగా అప్పుడిది ప్రారంభమైంది. అసలు "టాట్ టూ" అంటే సైనికులను తమ తమ బసలకు పొమ్మని పిలిచే సంకేత నాదం కాని రాను రాను అది ఇలా వేడుకగా సంబరంగా మారింది.

సాధారణంగా సిపాయిలు, సైనికులు సాయంకాలాల్లో స్థానిక విలాస గృహాలలలోను, కఫేలలోను గడుపుతూ ఉండేవారు. పానశాలల్లో ఉండే వీరిని తిరిగి డేరాలకు పొమ్మని రాత్రి 9 గంటల వేళ ఒక 'టముకు' వేసేవారు. ఒకే ఒక్క డప్పువాడు అన్ని వీధులూ తిరిగి హెచ్చరికగా వాయించుతూ, దుకాణాలు మూసేయమంటూ ఉండేవాడు. ఈ ఢక్కా నాదాన్ని టాప్‌టో అనేవారు. అదే దరిమిలాన "టాట్ టూ" 'ఉత్సవం' అయింది. అయితే ఒకే ఒక టముకువాడు అన్ని వీధులూ తిరిగి పానశాలలను మూయించటం, సైనికులను తిరిగి నివాసాలకు పొమ్మనడంఅసాధ్యమయ్యేది. దాంతో ఒక చిన్న పటాలబృందం బ్యాండు మేళంలాగా వీధులంతా తిరుగుతూ ఈ హెచ్చరికను చేసేవారు. ఈ అలవాటు వేడుకగా మారింది. తొలిసారి 1868 లో ఈ ఉత్సవం 'ఆల్డర్ షాట్' (ఇంగ్లాండ్)లో జరిగింది.

అటుతర్వాత ఓ ఏడుకో ఏడాది అది ప్రజల నెక్కువగా ఆకర్షించుతూ వచ్చింది. 1950 లో ఎడింబర్గ్ (స్కాట్లాండ్)లో ఈ ఉత్సవాలు ఒక అంతర్జాతీయ సంబరంగా గొప్పగా జరిగాయి.

ఇక 1957 లో బెర్ముడాలో ఇవి జరిగినప్పుడు ఇంకా అద్భుతంగా ఉన్నాయ్! పెద్ద క్రీడా మైదానంలో ఈ విన్యాసాలు, బ్యాండు వాయిద్యాలు జరిగాయి. కాని ఇక్కడ ఇంగ్లాండ్, స్కాట్లండ్‌లకు మల్లే పెద్ద కోట, దాని బురుజులు లేవు. అదో వెలితి గనుక, దానికో సినిమా సెట్‌లాంటి పధ్నాలుగు అడుగుల ఎత్తైన కోటగోడను నిర్మించి దానిముందు ఈ ఉత్సవాలు జరుపుతున్నారు. అలోటు తప్ప అంతా అద్భుతంగా జరిగింది.

— టెంపిల్ మానింగ్.




## జరిగిన కథ

రామచంద్ర పురవాస్తవ్యుడు ప్రసాద రావుగారి కుమార్తె నిర్మలకు అజంతా విహారాలు చూచేందుకు సహాధ్యాయినులతో వెళ్తుండగా త్రోవలో కారు చెడిపోయి ప్రయాణం సాగక బాధపడుతున్న ఓ లెక్చరర్ దంపతులతో పరిచయం ఏర్పడుతుంది. లెక్చరర్ దంపతుల మనస్సులో నిర్మల స్థానమేర్పరచుకుంటుంది. ఆ లెక్చరర్ భార్య రుక్మిణమ్మగారు నిర్మలకు తన బావగారి కుమారుడు ప్రకాశ్‌తోను, నిర్మల చెల్లెలు వసంతకు వేటపాలెంలోని బడి పంతులుతోను వివాహం స్థిరపరుస్తుంది.

## 3

పెళ్ళిళ్ళు రెండూ నిర్విఘ్నంగా జరిగిపోయాయి. వసంతకు, తనకు ఇచ్చిన నగలు, వస్త్రాలు, వస్తువులు చూచి అందరూ ఆశ్చర్యపడ్డారు. ఈ విషయంలో కొందరు చెవులు కొరుక్కున్నారు. ముఖ్యంగా ప్రకాశ్ కిచ్చిన పెద్ద వజ్రపు టుంగరం గూర్చిన విషయం. ప్రసాదరావు కింత డబ్బెక్కడిది ? అనే ఆలోచనే అందరికీను. అందరూ రకరకాలుగా చెప్పుకున్నారు.

నిర్మల కూడ ఆశ్చర్యపడకపోలేదు. కానీ ఆమె గ్రహించగల్గింది. తెలిసిన తర్వాత ఒక విధంగా బాధపడింది కూడ. పిన్నిదగ్గరున్న చనువుకొద్దీ నిలదీసి అడిగింది. ఆమె చెప్పక తప్పిందికాదు. "మా పుట్టింటినుంచి ఏడాదికి ఎనిమిదేసి వేల చొప్పున వాటా, అక్కయ్యకి వస్తాయి. అక్కయ్యను ఒప్పించి ఆరువేలు మీ నాన్నగారి కిచ్చాను. మిగతా రెండు వేలు నా బహుమానం అది — మొత్తం నాన్నగారి కిచ్చాను" అంది.

నిర్మల కృతజ్ఞతతో కూడిన సంతోషంతో ఆమెకు హృదయపూర్వకంగా నమస్కరించింది. రుక్మిణమ్మ కళ్ళు ఆర్ద్రాలైనై. నిర్మల నాప్యాయంగా అక్కున చేర్చుకుని అస్పష్టంగా అంది: "మా అక్కయ్య కుటుంబంలో జ్యోతి వెలిగించి అందరికీ మార్గదర్శినిగా ఉండాలని ఆశీర్వదిస్తున్నానమ్మా."

నిర్మల హృదయం పరిపరి విధాలుగా బోతోంది. వీరికి వైవాహికంగా, ఆర్థికంగా బంధింపబడింది. వారు చేసిన త్యాగమన్నా, మరేమన్నా అనండి— గొప్పది. ఆదర్శనీయులు. ఎప్పటికైనా కథ అడ్డం తిరిగితే తన్నింత గౌరవంగా, ప్రేమగా చూస్తారా? వారి దెప్పుడుమాటలకు, కల్గించే అవమానానికి

**తను కట్టుబడి ఉండాలి. అంతే. అటువంటి పరిస్థితి** రాకుండుగాక—అని అనుకుంటోంది.

వసంతను, నిర్మలను అత్తవారిళ్లకు పంపి, కమలమ్మ, ప్రసాద్‌గార్లు హాయిగా ఊపిరి పీల్చారు.

అది రెండంతస్తుల మేడ. లధునాతన పద్ధతిలో నిర్మింపబడింది. పెద్ద మామిడితోటలో మధ్యస్థంగా కట్టబడింది. ముందుభాగంలో తోట క్రోటన్సుతో, పూలమొక్కలతో నిండిఉంది. వేసవి కాలం కాబట్టి మల్లెలు, నిత్యమల్లెలు తప్ప, మిగతా పువ్వులు పూయలేదు. మామిడిచెట్లనిండా కాయలు మోయలేమీ బరువన్నట్లు కొమ్మలు బాగా ఒరిగి ఉన్నాయి. అరుణోజ్జ్వల కాంతిలో ఆతోట, ఎంతో రమ్యంగా ఉంది. అడుగువేసే కొలదీ దగ్గర కొస్తున్న ధవళకాంతుల్నీనే మేడ; నిర్మల హృదయంలో "నేను ఈ ఇంటి కోడల్ని కదా ?" అను భావం రాగానే సంతృప్తితో నిండిపోయింది. ఆ భావాన్ని గౌరవించి—ఆ స్థానాన్ని నిలబెట్టుకోవాలి అనుకుంది.

పెళ్లివారి హడావిడి, బంధువుల రాకపోకలు, మర్యాదలూ, పేరంటాండ్ర పరిచయాలు రుక్మిణమ్మ, నిర్మల అత్త సావిత్రమ్మ హయాంలో సక్రమంగా జరిగినై—కానీ "చదువుకున్న పిల్లయినామంచి అణకువ గలదమ్మా"—"ఆ! క్రొత్తలో అంతా అలాగే ఉంటారు. రోజులు గడిస్తే తెలీదూ !" "కట్నం లేని వాళ్లట ...." "ఏంతెచ్చిందమ్మా .... అని అడిగితే ఏవేవో చూపిస్తారు గానీ ఫలానాది—అని నోరెత్తి చెబితేగా ? ...."—"అంటే ఏం తేలేదన్నమాట"— అని నేనంటే వాళ్లత్త ఏమందో తెలుసుగా ? ఒకళ్లది మాకెందుకమ్మా—పిల్ల వచ్చింది—చాలు—ఐనా పది తరాలపాటు కాలు కదపకుండా తినేటంత. ఉంటే ఇంకెందుకు ?" — "ఆ సావిత్రమ్మకు మహా గర్వంలే—ప్రతి మాటలో తమ కెంతుందో చెబుతూనే ఉంటుంది."—" ఈ కోడలు చేతితో అందరూ సుఖపడ్తారని కోరి కోరి తెచ్చిందట ఆమె నోతెలు"—"చూద్దాంగా — ఏం సుఖపడ్తారో — కుంటి ఆడబడుచూ — సాధించే సావిత్రమ్మా, [illegible] సుఖపెడ్తే చాలు"—"అయినా స్వంత మేనకోడల్ని వదులుకుని ఈ పరాయి సంబంధం చేసుకున్నా రెందుకో"—"పిచ్చిదానా—ఆమాత్రం తెలీదూ — ఇలాంటి పిల్లను చేసుకుంటే అణిగి మణిగి ఉంటుందని" పేరంటానికొచ్చినవారి గుసగుసలు. అటూ ఇటూ తిరుగుతున్న రుక్మిణమ్మ చెవిలో ఒకటి రెండు మాటలు దూరితే —— "ఛీ .... ఆడవాళ్ల బుద్ధి —ఎప్పుడూ ఇంతే" అనుకుంది.

[illegible] లోకం ఒకరు సుఖపడటం చూసి [illegible]. [illegible] అసలు [illegible]. [illegible] ఎందుకు, ఎలాగు, [illegible] అని అనాలో తెలియందిగాని పదిమంది నోళ్లలో నానా ఆ మాట నానదు. [illegible] —" అవును .... లోకం అంతే. ఇంతే .... [illegible]?" అని. అది లోకంలో జరిగే న్యాయం—దాని సాధారణ గుణం [illegible] అంటుంది [illegible]. నిర్మల కోడరికం సవ్యంగా ఉంటే, దాన్ని గూర్చి పదిమంది చెప్పుకోరు. అలా చెప్పుకోటం ప్రపంచ సత్యానికి విరుద్ధం. అపజయం పొందనీయండి, ఎందరు దాన్ని గురించి మాట్లాడుతారో ! "నే చెప్పలేదూ ?" "ముందే అనుకున్నా నలాగౌతుందని" ఇత్యాది వ్యాఖ్యానాలతో సంతృప్తి చెందుతారు.



వెయ్యిరూపాయిల బహుమతి-నవల 'బంగారు పంజరం' రచయిత్రి శ్రీమతి కోమలాదేవి.

శ్రీమతి కోమలాదేవి కర్నూలు జిల్లా ఆదోనిలో జన్మించారు. మద్రాసు స్టెల్లామేరీస్ కళాశాలలో ఇంటరు, గుంటూరు మహిళా కళాశాలలో బి. ఎ., గుంటూరు సెంట్ జోసెఫ్ కళాశాలలో బి. యి డి. చదివారు.

ప్రస్తుతం శ్రీమతి కోమలాదేవి బెరైలీలో ఉంటున్నారు ఆమె భర్త అక్కడి ఇండియన్ వెటర్నరీ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్‌లో అసిస్టెంట్ రిసెర్చి ఆఫీసరుగా పనిచేస్తున్నారు. జాతీయ సమైక్యతాపథకం క్రింద శ్రీమతి కోమలాదేవి అక్కడి ప్రభుత్వోద్యోగులకు తెలుగు నేర్పుతున్నారు.

అందరూ వెళ్లిపోయారు. ఇంతలో ఒక పనిపిల్ల వచ్చి, డాక్టరు వచ్చారని చెప్పింది. సావిత్రమ్మ గబగబ వెళ్లి ఆమెను లోపల కాహ్వానించింది.

"మన్నించాలి, త్వరగా రాలేకపోయాను" అందామె.

**"అసలు మీ డాక్టర్లతో ఎప్పుడూ ఇంతే. మిమ్మల్ని నమ్ముకుంటే ఏమీ జరుగదు."** మాలతి క్రచ్చస్ (చేతిక్రింద ఉంచుకునే కర్రలు)తో నడుస్తూ వచ్చి, ఆమెప్రక్క కూచుంది.

"ఎలా ఉంది మీకు?" సావిత్రమ్మను చూచి ప్రశ్నించింది. **"మా అమ్మకు పెళ్లి సంబరంలో తీరికలేక జబ్బుగా ఉండను మర్చిపోయింది" మాలతి మాటల కందరూ నవ్వారు.**

నిర్మల, ప్రకాష్‌లు వచ్చారు. నిర్మల ఆమెకు నమస్కరించింది. సుమారైన పొడవు, లావు, నిండుగా ఉన్న ముఖం—ఆభరణరహితములైన చెవులు, మెడ, చేతులు, చూపుల్తోనే మనిషి నట్టే గ్రహించ శక్తిగల్గిన వాడియైన దృష్టి, వివిధానుభవాల ఫలితంవల్ల ఏర్పడిన ఫాలభాగంమీద అస్పష్టంగా అగుపిస్తున్న ముడుతలు—చూడగానే శాంతం, ప్రేమ—ఈ రెండింటితో చేయబడిందా అని భ్రమ కల్గించే ముఖవర్చస్సూ నిర్మలలో వెంటనే ఆమెపై పూజ్యభావం కల్గించినవి.

నిర్మల చదువు విషయం, ఎక్కడ చదివిందీ ఇత్యాదివన్నీ అడిగి తెలుసుకుంది. సావిత్రమ్మ డయాబిటీస్ పేషంటు. ఆమె ఆరోగ్యం కొద్దిగా కుదుటబడిందని తెలిసికొని సంతోషించింది. క్రొత్త మందులు వ్రాసిచ్చింది. కాఫీ, ఫలహారం తీసుకుని నిర్మల, ప్రకాష్‌లకు చలువరాతి దీపస్తంభం బహూకరించి, ఆశీర్వదించి వెళ్లిపోయింది.

ప్రకాష్ ఆమె సంగతంతా నిర్మలతో చెప్పాడు. ఆమె డాక్టరు శాంత. భర్త లేడు. అంటే చనిపోలేదు. ఎక్కడున్నాడో తెలీదు. చాల పలుకుబడి గల డాక్టరు. "శాంతి నిలయం" అని ఒక నర్సింగ్ హోమ్ స్థాపించింది. ఎందరికో ఆమె ఉచితంగానే సేవ చేసింది. ధనవంతుల దగ్గర బాగా డబ్బు తీస్తుందిగానీ బీదల ఇండ్లకు కూడా వెళ్లి ట్రీట్‌చేస్తుంది. ఆమెక్రింద ఇంకా ఇద్దరు డాక్టర్లున్నారు. ఆమెకు డాక్టరు. సంతానం లేదు. గానీ ఇద్దరమ్మాయిలను పెంచుతోంది. చాల నిరాడంబరమైన జీవితమామెది. దాదాపు పది సంవత్సరాల నుంచి వారింటి డాక్టరు ఆమే.

నిర్మల విన్నది. ఆమెపై గౌరవం ఇనుమడించింది. ఎందుకో ఆమెతో మాట్లాడాలని ఉబలాటపడింది. నిజమే. కొందరి వ్యక్తుల వ్యక్తిత్వపు ప్రభావం అలాంటిది. నిర్మల ఎంతసేపో ఆమెను గూర్చి ఆలోచిస్తూండిపోయింది.

నిర్మల, ప్రకాష్‌ల జీవితం ఉల్లాసంగా ఆనంద తరంగాలపై తేలిపోతోంది. వారిద్దరి హృదయాలేకమై గాఢానురాగంతో తరించిపోయారు.

రోజులు సాఫీగా గడిచిపోతున్నాయి.

వసంత దగ్గరనుంచి ఉత్తరమొచ్చి చాలా దినాలైంది. నిర్మల కేదో వెలితిగా ఉంది. ఆవేళ వచ్చింది ఉత్తరం. గబగబ విప్పి చదవటం మొదలెట్టింది. చాల పెద ఉత్తరం వ్రాసింది.

"ప్రియమైన అక్కయ్యకు,

చాల దినాలకు వ్రాస్తున్నాకదూ ? క్షమించాలి.

—52 వ పేజీ చూడండి

# కాశ్మీర్ బోకె టాల్క్‌తో గంటలుతరబడి సువాసనగా తాజాగావుండండి

అత్యద్భుతమైన, నాణ్యమైన కాశ్మీర్ బుకె కాన్కలు ఒక సౌందర్య టాల్క్...ఒక బేబీ పౌడరు

పూల గుచ్ఛంలోనికి చొబ్బినట్టుగావుంటుంది, కాశ్మీర్ బుకె టాల్క్ యొక్క చల్లని, పూలరేకు వంటి మెత్తదనాన్ని అనుభవిస్తే. వొళ్లు అంతా రాసుకొనండి, నవ వసంతపు ఘుమఘుమలతో రాజిల్లుతారు.



శిశువును సంతోషంగా హాయిగా వుంచండి! కాశ్మీర్ బుకె ప్రతి యితర ప్రత్యేక బేబీ పౌడరువలె మెత్తగా, సున్నితంగా వుంటుంది. మీ ఇద్దరూ ఉపయోగించగల ఒకే పౌడరు అందు బాటులో వుండటం ఎంత మేలు!




# కాశ్మీర్ బొకె

పురుషులు వాంఛించే సువాసనగల టాల్కం పౌడరు

CB-8-19-TEL.

# ఢిల్లీలో ప్రజాస్వామ్య పాలనపై ఆరాటం!

శ్రీ కృష్ణ



భారత్, భూటాన్‌లమధ్య తపాలా ఉత్తర ప్రత్యుత్తరాల మార్పిడికి సంబంధించిన ఒప్పందం ఢిల్లీలో జరిగినప్పటి దృశ్యం.

కామన్వెల్తు ప్రధానమంత్రుల సమావేశానికి హాజరయ్యేందుకు మన ప్రధానమంత్రి లండన్ వెళ్ళారు. ఆయనవెంట ఆర్థికమంత్రి కూడా వెళ్ళారు. అందువల్ల న్యూఢిల్లీలో ఇప్పుడంతా ఆటవిడుపుగా, హాయిగా ఉంది. అంతా ఢిల్లీ వదిలి కాస్త అలా అలా బయల్దేరుతున్నారు.

ఈ వారం ఇక్కడ ప్రాముఖ్యంపొందిన విషయాలలో కల్లా ఢిల్లీ నగరానికి ప్రజాస్వామ్య పరిపాలనం ఏర్పాటు చేయాలని శ్రీ బ్రహ్మప్రకాశ్ మళ్ళీ చేసిన ప్రకటన అతిముఖ్యమైంది. దేశీయ వ్యవహారాల మంత్రి శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రి, ఒకే రాష్ట్రంలో ఒకే చోట రెండు ప్రభుత్వాలు పాలించలేవని ఖచ్చితంగా ప్రకటించిన అనంతరమే ఈవిధంగా శ్రీ బ్రహ్మప్రకాశ్ కోరటం జరిగింది. ప్రస్తుతం ఢిల్లీలో జరుగుతున్న పాలనావిధానం అంత తృప్తికరంగా లేదని ప్రధానమంత్రి ప్రకటించటంతో కలకత్తా, న్యూఢిల్లీలలోని స్టేట్స్‌మన్ పత్రిక పాపం కాస్త ఆశాకిరణాన్ని చూచుకుంది. కాని, ప్రధానమంత్రి కూడా ఢిల్లీకి శాసనసభ, ముఖ్యమంత్రి పదవులను కొట్టిపారేశారు. అయినా ఈ పత్రికకు ఇంకా ఆశ వదలలేదు. ఢిల్లీవాసులంతా కేవలం అంధకారంలో బ్రతుకుతున్నారనీ, ఏనాటికోనాటికి ప్రజాస్వామ్య వ్యవస్థ ఢిల్లీకి ప్రసాదించటం జరుగుతుందనే ఆశాభావంతోనేఉంది!

చాలాకాలంక్రిందట భారత దేశానికి రాజధాని కలకత్తాలో ఉండేది. తరువాత దీన్ని ఢిల్లీకి మార్చారు. ఇలా ఎందుకు చేసినట్లు? ఒకేచోట, రెండు శాసన సభలు, రెండు ప్రభుత్వాలు, రెండు మంత్రి మండలులు దేశాని కొకటి, వంగరాష్ట్రాని కొకటి ఉన్నందువల్ల మార్చాల్సివచ్చింది. కొన్నేళ్ళక్రిందట ఢిల్లీకి మంత్రిమండలి పరిపాలనం ఏర్పాటు చేసినప్పుడు సరిగా ఇలాంటి పరిస్థితే ఏర్పడింది. ఇంతెందుకూ! ఢిల్లీకి ఇప్పుడు కావలసిందల్లా కేంద్రీకృతమైన అధికారాలతో పరిపాలనం. కాని, ఇప్పుడు ఇందులో రెండు చిక్కులేర్పడుతున్నాయి. కార్పొరేషన్ అనేది సలహా మండలేనని, దాని కార్యనిర్వాహకుడు కార్పొరేషన్ కమీషనరేనన్న సంగతిని కార్పొరేషన్ సభ్యులు ఇంకా గ్రహించకపోవటం మొట్టమొదటిది. కార్పొరేషన్ దైనందిన కార్యక్రమాల్లో వీలైనంత జోక్యం కల్పించుకునేందుకు ఈ సభ్యులు శాయశక్తులా ప్రయత్నిస్తున్నారు. దానికి తగ్గట్టు ఈ కార్పొరేషన్ కమీషనర్ వెనకటి కమీషనరంత స్థైర్యంలేక, దౌర్బల్యంతో ఉండటం విచారించదగ్గ విషయం.

రెండో సమస్య శ్రీ బ్రహ్మప్రకాశ్ వర్గం, తన అధిక సంఖ్యాబలంతో కార్పొరేషన్‌ను విచ్ఛిన్నం చేయాలని నిత్యం ప్రయత్నిస్తుంటుం దీ వర్గం. ఇలా విచ్ఛిన్నం చేసినందువల్ల ఢిల్లీ నగరానికి మంత్రి మండలి పరిపాలనం ఏర్పరచవచ్చునని బ్రహ్మప్రకాశ్ వర్గీయుల గాఢ విశ్వాసం మరి! అయితే శ్రీ బ్రహ్మప్రకాశ్ ఇలా అనుకోటానికి తగ్గ కారణాలు చాలా ఉన్నాయంటే తప్పేంలేదు. పైగా ఆయన కృష్ణమీనన్ 'వర్గం'లో చేరిపోయాడు. ఈ 'వర్గం' అనే మాట కాస్త విచారించుకుందాము.

శ్రీ నెహ్రూ మంత్రివర్గంలో శ్రీ మొరార్జీ దేశాయ్, కృష్ణమీనన్‌లకు వర్గాలున్నాయనేది అందరికీ తెలిసిన "విషయం." శ్రీ మీనన్ 'పక్షం'లో శ్రీయుతులు కె. డి. మాలవ్యా, జగజీవన్‌రాంలాంటి వాళ్ళు కూడా వున్నారు.

శ్రీయుతులు లాల్‌బహదూర్‌శాస్త్రి, టి. టి. కృష్ణమాచారి, యస్.కె. పాటిల్, సి. సుబ్రహ్మణ్యంల వ్యక్తిత్వాలే వేరు. వాళ్ళనుగూర్చి వాదం అనవసరం. మిగిలినవారు తటస్థులు, ఎప్పుడూ, ప్రధానమంత్రినే సమర్థిస్తుంటారు. అంటే శ్రీయుతులు కృష్ణమాచారి, పాటిల్, సుబ్రహ్మణ్యం, శాస్త్రి ప్రభృతులు ప్రధానమంత్రి నెదిరించటమే పనిగా పెట్టుకున్నారనిగాదు. అర్థం వీళ్ళు అటు మొరార్జీ వర్గానికీ, ఇటు కృష్ణమీనన్ పక్షానికి చెందకుండాఉన్న తటస్థులని మాత్రమే నేను చెప్పదలచుకుంది. అన్ని విషయాల్లో జరుగుతున్నట్లుగానే, ఈ ఉభయవర్గాలు కాంగ్రెస్ సభ్యులను వీలైనంత ఎక్కువగా తమ వర్గాల్లో చేర్చుకోటానికి ప్రయత్నిస్తున్నై. ఈ సందర్భంలోనే శ్రీ బ్రహ్మప్రకాశ్, శ్రీ మీనన్‌వర్గంలో చేరటం సంభవించింది.

ఏదేమైనా ప్రధానమంత్రి విదేశాలలో ఉన్న కాలంలో ప్రభుత్వ వ్యవహారాలను చూడటానికి నియమించబడింది శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రిగాని, కృష్ణమీనన్ కాదన్న విషయం తేలిపోయింది.

* * *

భారత కృషిక్ సమాజ్ గురించి లోక్‌సభలో జరిగిన ప్రశ్నోత్తరాలు ఎవరికీ పట్టనట్లుగానే మాటుమణిగాయి. ఒక ప్రశ్నకు లోక్‌సభలో సమాధానమిస్తూ, వర్క్సుమంత్రి శ్రీ మెహర్‌చంద్ ఖన్నా 1959 లో ప్రపంచ వ్యావసాయిక ప్రదర్శనం ఏర్పాటు చేసిన భారత్‌కృషిక్ సమాజ్ భారత ప్రభుత్వానికి ఇంకా రు. 32,27,853 లు బకాయిపడి ఉందని వెల్లడించారు.

—63 వ పేజీ చూడండి

**రాజధాని కబుర్లు**

# పరిశుభ్రతలేని రాష్ట్రరాజధాని నగరం

వర్షాకాలం వచ్చిందంటే సరి. మునిసిపాలిటీవారిమీద కొల్లలుకొల్లలుగా విమర్శలు వచ్చిపడతాయి. అడపా తడపా నాలుగు చినుకులు పడిపోవటం కాదాయె! కుంభవృష్టి, దాంతో శిథిలావస్థలోఉన్న పాతకట్టడాలన్నీ కొత్తవాటికి స్థానం ఇస్తానంటూ బెదిరిస్తూ ఉంటాయి. వాటంతటవి పడనూ పడవు. ఎప్పుడు మీద విరుచుకుపడతాయో తెలీదు! ఎవరికి వారు 'అటువైపుకు వెళ్లద్దు. ఆ ఇల్లు ఈ వానలకు' బాగా దెబ్బతిన్నది అంటారే గాని, ఏమి చెయ్యాలో శ్రద్ధ పట్టించుకోరు! అయితే ఈ శ్రద్ధ పట్టించుకోవాల్సింది ప్రజలేకాదు నిజానికి. అంతకంటె ముఖ్యమైనవాళ్లు, బాధ్యతలు నెత్తిమీద వేసుకుని కూర్చున్నవాళ్లున్నారు. వారే మునిసిపాలిటీవారు. విమర్శలు వచ్చిపడతాయంటే ఎందుకు పడవు! హైదరాబాదులో జీర్ణావస్థలోఉన్న 'భవనాల' లిస్టును ఒకటి తయారుచేసి, వాటి ఆయుస్సు లెక్కకట్టి, బ్రతికే అవకాశం ఉంటే ప్రాణవాయువు ఇవ్వటమో, లేకపోతే భూమట్టం చెయ్యటమో జరిగితే ఇంత రభసఎందుకుంటుంది! ఎప్పుడో ఫెళఫెళమంటూ ఏ కట్టడమో కూలంగానే, దానిమీద దర్యాప్తు జరపటం ఎవరిది తప్పు అని నిర్ణయించటం జరుగుతుందే కాని, దానివలన కలిగే తీరని నష్టాన్ని ఎట్లా పూడ్చుకలుగుతారు!

ఎప్పుడో మాట! హైదరాబాద్ రోడ్లమీద నడవటం అదో సరదా! నడవటంఅంటే కేవలం లిటరల్‌గా తీసుకోకండి! అటు విశాలానికి గాని, శుభ్రానికి గాని పెట్టింది పేరు. నిత్యం డ్రాయింగ్‌రూములాగ శుభ్రపరుస్తూ ఉండేవాళ్లు! చెత్తాచెదారం ఏమీ లేకుండా,రోడ్లన్నీ సూర్యకిరణాలకు తళతళ మెరుస్తూ ఉండేవి. రోజులు మారినాయి. మనుష్యులు మారారు. ఇప్పుడు అలాంటిదేమీ లేదు. ఎప్పుడో వాళ్లకు బుద్ధిపుట్టినప్పుడు తుడిస్తే తుడిచినట్టు; లేకపోతే లేదు. అయితే ఈ భారీ వర్షాలకుమాత్రం రోడ్లు కొంతవరకు పరిశుభ్రం అవుతున్నాయి. అంతవరకు సంతోషించాల్సిందే! అయితే ఈ వర్షపు నీరు రోడ్లకు రెండు వైపులా కాలవల్లాగ ప్రవహించటం, డ్రయినేజివారి ఆచ్ఛాదంలేని తూములలోకి అమాంతం చిన్నపిల్లలు పడిపోవటం కూడా కద్దు. మరి వాటికి తగిన బందోబస్తు ఎందుకు చెయ్యలేదని అడగటం కూడా తప్పేనా! దీన్ని గురించి విమర్శ రాకుండా ఎందుకుంటుంది? ప్రాణాపాయం కలిగే సందర్భాలలో కూడా వీరి కింత లాలసత్వం ఎందుకో అర్థం కాదు.ఇవే కాకుండా హఠాత్తుగా రోడ్లను బాగుచెయ్యటానికో, నీటిసప్లయి కోసమో, కొత్త పంపుల్ని పెట్టటానికో, రోడ్లను మధ్యలో తవ్వేసి, ఎవరి దోవన వాళ్లు చక్కాపోతారు. పదిమంది నడిచే రోడ్లకు గండ్లుపెట్టటం ఎందుకు! రికామీగా వెళ్ళిపోవటం ఎందుకు! ఈ వానల కేమో ఎత్తుపల్లాలు తెలీక, తికమకపడుతూ, అందులో రాత్రిపూట మరీను—గభాలున ఆ గుంటలో దిగబడటమో, కాస్త ధూకుడుగా వెళుతుంటే సైకిలు తలక్రిందులవటమో, లేకపోతే మనిషే క్రిందపడటమో జరిగిపోతుంది. ఇది కేవలం ప్రజల పట్ల నిర్లక్ష్యం అనాలో, దీనిని అరికట్టే పై అధికారంటూ ఎవ్వరూ లేరని అనుకోవాలో అర్థంకాదు. ఇలాంటి చిన్న చిన్న, పెద్ద పెద్ద ప్రమాదాలు అన్నీ పూర్తిఅయిన తర్వాత, ఓ పెద్ద ప్రకటన చేస్తే సరిపోతుందనే ధీమానా, మునిసిపాలిటీవారికి!

వర్షాలు లేనప్పుడుమాత్రం ఈ రోడ్లు ఎప్పుడు బాగున్నాయి కనుక!ఎన్నడో, ఏదో కారణాన ఈ రోడ్లు పడ్డాయి. అంతే! వాటిని అవసరంఅయినప్పుడు బాగు చేయించకుండా ఉంటూఉంటే అవిమాత్రం ఎన్నాళ్లని చక్కగా ఉంటాయి! వాటిమీద శ్రద్ధ లేదు. మొత్తం పట్నంలో చాలా రోడ్లు 'రిపేర్' కోసం ఎదురు చూస్తూ ఉన్నాయి. అయితే అక్కడక్కడ చెదురువాటుగా కొత్త రోడ్లు వేస్తున్నారు గదా అని, వీటి మాట మరిస్తే, మళ్లా మొదటికొస్తే వాటిని భరించటం చెడ్డ కష్టం. ముఖ్యంగా రిట్జ్ హోటలుకు దారితీసే రోడ్లు రెండూ అధ్వాన్నంగా ఉన్నాయని, విదేశీయులకు బసగా ఉంటున్న ఆ హోటలుకు కూడా సరియైన రోడ్లు లేకపోతే వాళ్లు మనల్ని గురించి ఏమనుకుంటారో అనే ధ్యాస లేకపోవటం కూడా ఆశ్చర్యంగానేఉంది. హోటలు యజమానులు, టూరిస్ట్ బ్యూరోవారు, ఇంకా ఇతర పెద్ద మనుషులు కూడా మునిసిపాలిటీవారికి దరఖాస్తులు పెట్టుకున్నప్పటికీ, వారిలో చలనం కలగ లేదట! వారి గుండె—నిబ్బరానికి ఆశ్చర్యపడాల్సిందే! కొత్తగా శాసన సభ్యులు ఉండేందుకు హాస్టల్ కట్టారు. దానికి వెళ్లాలన్నా, కంకరరాళ్లమీద క్రరుక్రరుమంటూ వెళ్లాలిసిందే! అసెంబ్లీ సమావేశాలప్పుడు మాత్రం బషీర్‌బాగ్ వైపునుంచి, వెళ్లే రోడ్లమీద నాలుగు తట్టలు మట్టిపోసి, కళ్లు కప్పేస్తారు. అంతే! ఇంతకంటె ఆశ్చర్యం సుల్తాన్ బజారులో ఆంధ్రా బ్యాంకుకు ఎదురుగాఉన్న రోడ్డు పరిస్థితి, భారీ ఎత్తున ఆంధ్రప్రదేశ్ రోడ్డు రవాణా బస్సులు బర్రుమని తిరుగుతూనే ఉంటాయి. నాలుగు రోడ్ల కలయిక, అలాటి ముఖ్యమైన కూడలిలోనే ఇంత అశ్రద్ధ జరుగుతోంది. మచ్చుకు రెండు మూడు ఉదాహరణలు ఇవ్వటమైనది. ఇలాంటివే చాలచోట్ల పట్నంనిండా కన్నుల పండువుగా కనిపిస్తూనే ఉంటాయి! అధిపతులు మారుతున్నారేకాని, కరుడు కట్టిన మునిసిపాలిటీ మనస్తత్వంమాత్రం మారటంలేదు.

* * *

మునిసిపాలిటీవారిని మించిఉన్నారు ప్రభుత్వంవారు. అదొక పద్మవ్యూహంలాంటి యంత్రాంగం. లోపలికి వెళ్లటం అంత తేలిక కాకపోయినా, తప్పించుకుని బైటపడటంమాత్రం మహాకష్టం. సచివాలయభవనంలోకి జొరపడితే, ఎక్కడ మునిగి ఎక్కడతేలతావో చెప్పటం కష్టం! అందులో కొన్నికొన్ని 'సొరంగాలు' చీకట్లు మింగి కూర్చున్నాయి. కొన్ని గదుల్లో పగలే లైట్లు వేసుకుని కూర్చోవాల్సిందే ! ఆఫీసులా ఎక్కువేను ! భవనం వైశాల్యం తక్కువేను! అందువల్లనే ప్రభుత్వ కార్యాలయాలన్నీ ఈ పెద్ద భవనంలోనే ఇరికించటానికి వీల్లేకపోయింది. బోలెడంత అద్దెపోసి, అక్కడా, ఇక్కడా నగరమంతా ప్రభుత్వ కార్యాలయాలు అల్లుకుపోయి ఉన్నాయి. వీటన్నింటిని ఒకచోట చేర్చి, సమైక్యత సాధించాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చాలా రోజులక్రిందటే పట్టుగా ఆలోచించింది. దానికో దీర్ఘమైన ప్రణాళిక కూడా తయారు చేసింది. దాన్ని అనుసరించే బీగంపేట దగ్గర సచివాలయ భవనాల నిర్మాణం చెయ్యాలని తీర్మానించింది. ప్రజలసొమ్ము సుమారు ఒకటిన్నర కోట్లు ఖర్చుపెట్టి, భవనాలు కడతామంటే దాంట్లో మంచి చెడ్డలు ప్రజలు చెప్పకపోతే ఎవరు చెపుతారు? అందువలనే కావలసినంత గాలిదుమారం బయలుదేరి హైదరాబాదు సరిహద్దులు దాటి, ఢిల్లీదాకా వెళ్ళి చుట్టేసింది. ఏమయినాసరే, ఈ ప్రణాళిక అమలు జరపాల్సిందేఅని ప్రభుత్వంవారు పట్టుపట్టటం, అప్పట్లో రిపబ్లిక్ అధ్యక్షులుగాఉన్న డాక్టర్ రాజేంద్రప్రసాద్‌గారిని, ఈ భవనాల శంకుస్థాపనకు రమ్మనమని ఆహ్వానించటం, ఆయన అంగీకరించటం, హఠాత్తుగా వచ్చిన అస్వస్థత కారణంగా ఆ పెద్దమనిషి ఇక్కడికి రాకపోవటం జరిగిపోయినాయి. ఇదంతా స్థూలంగా గుర్తుకు తెచ్చుకోవటం అవసరం. మరి ఆయనగారు రాలేనప్పుడు ఇంకెవ్వరినైన ఆహ్వానించి,ఆ లాంఛనం కాస్తా పూర్తిచేసిఉంటే ఈపాటికి పునాదులు లేచేవేమో! అట్లాగూ చెయ్యలేదు. మత్తుగా ఊరుకున్నారు. అప్పటికే ప్రజల సొమ్ము ఎనిమిది, తొమ్మిది లక్షలు అక్కడ వినియోగం అయిందనేమాట కూడా గుర్తుకు తెచ్చుకోవాలి!

ఇంతా రభస అయిన తర్వాత, పునరాలోచనెందుకు! అలాంటి ఆలోచనకు అవసరమే కలుగుతే ముందుగానే ఆ పని ఎందుకు చేయలేదు? అప్పట్లో ప్రజల ఆక్షేపణ తీవ్రంగా ఉండటమే కాకుండా, తీవ్రమైన అభాండాలుకూడా వేశారుగదా! ఇంతకాలం ఉపేక్షించటం ఎందుకు! మళ్లీ ప్రభుత్వంవారు ఆలోచిస్తున్నారు. ఈసారి రెండు విషయాలు ఆలోచిస్తున్నారుట! మొదటిది, ఇంత డబ్బు ఖర్చుపెట్టి, ప్రస్తుత డబ్బు గిజాటులో (ఈమధ్యనే ప్రజల్నుంచి అప్పు కూడా తీసుకున్నారు!) భవనాల నిర్మాణం ప్రారంభించటమా! ఒకవేళ అలాంటి నిర్ణయమే తీసుకుంటే ఎక్కడ ఈ కట్టడాలు నిర్మించాలి! ఈ రెండు సమస్యలు జటిలంగా వచ్చేసి, ప్రశ్నార్థకాల్లాగ తయారయినాయిట. అందువలన దీనికో సంఘం కూడా వేశారని వినికిడి. దీంట్లో మంత్రులతోపాటు, ప్రతిపక్ష నాయకుల్ని కూడా ఉండమని ఆహ్వానించారుట! వీరంతా కలిసి అప్పుడే స్థలాల వేటకు బయలుదేరారు అసలు కట్టడం నిజమో, అబద్ధమో తేలక మునుపే! ఈ పద్ధతి బాగానేఉంది. ఏమి నిర్ణయించినా, ప్రతిపక్ష సభ్యులు కూడా ఉన్నారుగదా అంటూ కొంత విమర్శ తప్పించుకోవచ్చు, కొంత వరకు బాధ్యతా తప్పించుపోవచ్చు.

—ఐ యల్. ఎస్. ★

## తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది!



(గత సంచిక తరువాయి)

"ఐతే మళ్లీ నువ్వు వెళ్ళలేదా సినిమా తియ్యటానికి?" అని అడిగాడు, ధనవంత ఆత్రుతగా.

"చెప్పనీండి మరి, లేదు. నా మిగతా పార్ట్నర్సూ, నేనూ అంతా పరిశ్రమ వదిలివేశాము. సినిమా పరిశ్రమలోవుండి, సవ్యంగా నడుపుకుంటే ఫరవాలేదు గాని, అటూ, ఇటూ ఐందా—ఖేదం తప్పదు. డబ్బులు రావటంలేదని, వాళ్లంతా ఖేదంతోనే గడుపుతున్నా, నేను మాత్రం మోదంతోనే ఉన్నాను. ఎంచేతంటే—కొన్ని కష్టాలు తప్పాయి నాకు. కాని—నాకున్న బాధ ఏమిటంటే—నా స్వంత ప్రజ్ఞ ఉపయోగించి, నన్ను ఎవరైనా సినిమా తియ్యమనాలని. ఐతే అది వీలుకాదుగా. వీలు కానంతకాలం బాధే" అన్నాడు మహాశయుడు.

"ఐనట్టేగదా" అన్నాడు కుమారరత్నం.

"అవా" అన్నాడు మహాశయుడు.

"అమ్మయ్యా—ఫాదర్, ఫైవ్‌లాక్స్......" అన్నాడు రత్నం.

"దేనికిరా అబ్బాయి? రామాయుణం అంతావ్.., రాముడికి సీత ఏమవుతుందని అడుగుతున్నావా?" అన్నాడు ధనవంత.

"ఆవిధంగా అడగవలసినవాడిని నేనేం కానులెండి. నాకు తెలుసు—సీత రాముడి కేమవుతోందో."

"అది సరేలే. నువ్వు మళ్లీ డబ్బు అడుగుతున్నావెందుకని? విన్నావుగా—మనవాడు చెప్పిన కథలన్నీ అవన్నీ విన్నాకకూడా నీకు సినిమా తియ్యాలనిపిస్తోందీ!

"ఐతే ఒకటుందిలెండి. నా కథలన్నీ విని సినిమా తియ్యకూడదని నా ఉద్దేశంకాదు. అందులో జరిగిన (సి)నీతులన్నీ గ్రహించి, ఆ ప్రకారం జాగ్రత్త పడాలని" అన్నాడు మహాశయుడు.

"జాగ్రత్తపడినా, మానినా ముందు బోలెడు డబ్బు పొయ్యాలిగా" అన్నాడు ధనవంత.

"పొయ్యొద్దా మరీ—"

"పోస్తే ఏముందినాన్నా—లాభాలొస్తాయిగా"

"వచ్చినట్టేవుంది ఇదంతా చూడగా—"

"వినగా—" అని కరక్టు చేశాడు మహాశయుడు.

"సరే, రేపు చెబుతాను—ఇప్పుడు నన్ను ఆలోచించుకోనీ" అని ధనవంతుడూలేచి, ఎక్కడికో గర్భగుడిలోకి వెళ్ళిపోయాడు. మహాశయుడికి ఆశ కలిగింది. అతను కుమారరత్నందగ్గరచేరి లాలించాడు, బుజ్జగించాడు, మంచిమాటలాడాడు, జోలపాటలు, పాడాడు.

"ఐతే ఏమంటారు, ఏమిటి ఉద్దేశం?" అని అడిగాడు చిరాగ్గా కుమారరత్నం.

"ఏముంటుంది—నాచేత డైరెక్టు చేయించుకోమని. చింత చచ్చినా, పులుపు చావలేదు" అన్నాడు మహాశయుడు.

"ఆ డైలాగు అనవలసినవాడిని నేను—సరే" ఇప్పుడు నన్ను ఆలోచించుకోనీవండి. ఏ సంగతి రేపు తేలాక, నేనూ తేలుస్తా" అని కుమారరత్నం కూడా వెళ్ళిపోయాడు.

"నేనేనా ఆలోచించనివాడిని, నేనూ ఆలోచించి రేపే చెపుతాను" అని మహాశయుడూ వెళ్ళిపోయాడు.

ఆ మర్నాడు ముగ్గురూ కలిశారు. ధనవంతుడు మామూలుగా టిఫిన్లూ, కాఫీలూ తెప్పించాడు. ముగ్గురూ తిన్నారు.

"ఏమిటినాన్నా సస్పెన్సు?" అన్నాడు కుమారరత్నం.

—49 వ పేజీ చూడండి

# ప్రపంచప్రముఖులు- 16

ఐన్‌స్టయిన్‌లాంటి అఖండ ప్రతిభావంతులనుకన్న జాతి యూదుజాతి. ఆర్థిక సంపదకు, మేధాసంపదకు ఎంతమాత్రం లోటులేని జాతి అది. అయితే, పధ్నాలుగేళ్లక్రితంవరకు ఈ జాతికి తమదీ అని చెప్పుకోడానికి ఒక దేశం కూడా ఉండేదికాదు. లక్షలాది యూదులు పడరాని అవస్థలు పడుతూ, దేశదేశాలలో తలదాచుకుంటుండేవారు. ఏసుక్రీస్తు జన్మస్థానమైన పాలస్తీనాభాగాన్ని తమ మాతృదేశం చేసుకోవాలని, ప్రపంచ రాజ్యశ్రేణిలో తమ వ్యక్తిత్వాన్ని కాపాడుకోవాలని యూదు జాతీయులు దశాబ్దాలపాటు హోరాహోరీగా ప్రతిఘటనోద్యమం సాగించారు.

1948 ఆగస్టు 14–15 అర్ధరాత్రివేళ స్వతంత్ర ఇజ్రేల్‌రాజ్యం అవతరించింది. నానాజాతి ఆదేశం ప్రకారం ఏర్పడిన బ్రిటిష్ పరిపాలనాధిపత్యం ఐక్యరాజ్యసమితి ఆదేశం ప్రకారం నాటితో అంతమైంది. పాలస్తీనా రెండు ముక్కలైంది. అరబ్ పాలస్తీనా ప్రాంతాలు అరబ్ రాజ్యాలతో కలిసిపోయాయి. యూదులకు తమదీ అని చెప్పుకోడానికి వీలుగా ఇజ్రేల్ ఏర్పడింది. దానికి అధ్యక్షుడు వైజ్మన్ అయితే, ప్రధానామాత్యుడుగా వృద్ధనాయకుడు డేవిడ్ బెన్ గురియన్ పదవీ స్వీకారం చేశారు. ఇజ్రేల్ విస్తీర్ణం ఐదువేల చదరపు మైళ్ళనీ, జనభా 10 లక్షలకుమించి ఉండదదనీ అంటే అది ఎంత చిన్నదో ఊహించవచ్చు.

నాజీ నియంత హిట్లర్, రష్యా నియంత స్టాలిన్‌లు సాగించిన జాతి హింసాకాండలో హతులైన లక్షలాది యూదు జాతీయులు పోను దేశ దేశాలలో మిగిలివున్న యూదులు క్రమ క్రమంగా స్వదేశానికి చేరుతున్నారు.

ఇజ్రేల్ వైజ్ఞానిక పరిస్థితుల దృష్ట్యా చూస్తే పాశ్చాత్య రాజ్యాలకు అత్యంత సన్నిహితం; ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా చూస్తే ప్రాచ్య రాజ్యాలకు సన్నిహితం.

ఈనాడు ఇజ్రేల్ పరిస్థితి త్రేతాగ్ని జ్వాలల మధ్య ఉన్నట్టు ఉన్నది. శత్రుశ్రేణికిచెందిన అరబ్ రాజ్యాలు పరివేష్టించి ఉండడమే ఇందుకు కారణం. అయినా, ఇజ్రేల్ గత దశాబ్దన్నర కాలంలో స్థిరపడింది. దాన్ని ఎవరూ నాశనం చేయలేరనే ఇజ్రేల్ అధినేత బెన్ గురియన్ గాఢ విశ్వాసం.

సూయజు అతి విషమ అంతర్జాతీయ సమస్యగా ఏర్పడినప్పుడు (ఆరేళ్ళక్రితం) బెన్ గురియన్ చర్యను సమితిలోని ప్రముఖ రాజ్యాలన్నీ కటువుగా విమర్శించాయి. అప్పుడు ఇజ్రేల్ పార్లమెంటులో ఆయన ధైర్యం అంటే ఏమిటో ఇలా నిర్వచించాడు: "ధైర్యం అంటే ఒక ప్రత్యేక పరిజ్ఞానాన్ని కలిగి ఉండడమే. భయపడవలసినదాన్నిచూసి భయపడడం; భయపడకూడనిదాన్నిచూసి ఎంతమాత్రం భయపడకుండా ఉండడం." ఇది ప్రఖ్యాత గ్రీకు తత్త్వవేత్త ప్లేటో నిర్వచనం. ఇదే బెన్‌గురియన్‌కు నిత్యం శిరోధార్యమవుతున్న జీవిత సూత్రం. 




నిర్జీవ శవంలా పడిఉన్న దేహం మెల్లమెల్లగా కదిలింది. నిట్టూర్పుతోబాటు, నొప్పివల్ల బయటకు వచ్చిన మూలుగు నిశ్శబ్దాన్ని భంగపరిచింది. రత్న మెల్లిగా కళ్ళు తెరచింది. మేలుకున్నతర్వాత ఒక క్షణంవరకూ రత్న కళ్ళకు అంతా శూన్యంగా, చీకటిగా కనపడింది. ఆమె మెదడు ఏమీ ఆలోచించలేనంతగా అలసిపోయింది. మెల్లిగా ఆమెను ఆవరించిన మబ్బు విడిపోసాగింది. తనకేమయింది? ఇంతవరకూ నిద్రపోయానా? లేదా ఏమైనా జబ్బు చేసిందా? ఊహు......ఏమీ గుర్తుకు రావటంలేదు. ఇదేమిటి జుట్టంతా చెరిగిపోయింది. శుభ్రంగా దువ్వుకుని వేసుకున్న ముడి విడిపోయి, వీపుమీద పడి ఉంది—చచ్చిన పాములా.

రత్న మనస్సులో ఏదో గుర్తుకు వచ్చినట్టయింది. గబుక్కున లేచి కూర్చుంది. అవును, గది తనదే. గోడమీద తనూ, వాసూ తీయించుకున్న ఫోటోలు, తాను కుట్టిన డోర్‌కర్టెను, టేబుల్‌క్లాత్—అన్నీ తను తన ఇంట్లోనే ఉన్నట్టు చెపుతున్నాయి. కాని, తనలో ఏదో మార్పు వచ్చింది! అమూల్యమైనదీ, అపూర్వమైనదీ, తన ప్రాణంకన్నా మిన్న అనుకున్న వస్తువును దేన్నో తను కోల్పోయినట్టు అనిపిస్తోంది. కాని, పోయిన వస్తువేదో స్ఫురించటంలేదు. కళ్ళు అలవాటు ప్రకారం గడియారంవైపు తిరిగాయి. చిన్నముల్లు తొమ్మిది దాటింది.

రత్న తన చైతన్యాన్నంతా కూడదీసుకుని పక్కమీదనుండి లేచి నిల్చుంది. పక్కమీదికి ఎలా వచ్చాను? అన్న ప్రశ్న మెదిలింది. రత్న ఏదో గుర్తుకు తెచ్చుకోవటానికి ప్రయత్నిస్తూ, పక్కవైపు చురచురా చూసింది. అర్ధచంద్రాకృతిలో తల్లో అమర్చుకున్న పూలమాల రెండుగా తెగి, పక్కమీద పడి ఉంది. అప్పుడే వికసించి సౌరభాన్ని వెదజల్లుతున్న మల్లెమొగ్గలు బరువైన వస్తువుకింద పడటంవల్ల

—44 వ పేజీ చూడండి







వనితావాణి,
ఆంధ్రసచిత్రవారపత్రిక,
7, తంబుచెట్టివీధి,
మద్రాసు-1

## దాంపత్య జీవితం

"దాంపత్య జీవితం" వ్యాసంలో వ్రాసిన విమర్శలు చాలా అనుభవపూర్వకంగా, ప్రస్తుత సమాజ స్థితిని ఆకళింపుచేసుకుని వ్రాసినట్లుంది.

స్త్రీల త్యాగాలుఅంటే నాకు తెలిసిన ఒక సంఘటన జ్ఞప్తికివచ్చింది. భర్తజూదరియైనా భార్య, మనం సర్దుకుంటే సరిపోతుందని ఏదో విధంగా భర్తపెట్టే కష్టాలకోర్చి తన వంటిమీది నగలన్నీ ఒలిచి ఇచ్చిందామె. ఆఖరికి కుటుంబ పరిస్థితి బాగుపడకపోగా ఆమె ఆత్మహత్యకుపక్రమించగా అందరూ కలసి ఆమెను ఆపి, పుట్టింటికి పంపించారు. ఇటువంటి విషయాల్లో త్యాగంచేసినా ఫలితం ఏమిటి? .... ఒండొరుల మనస్తత్వాలను బట్టి, దానికి తగినట్లు ప్రవర్తిస్తే మంచిది.

కుమారి అంబటిదేవకి, రుద్రిరామామణి (కాకినాడ)

* * *

పై వ్యాసం చదువుతూంటే నా మనస్సు ఉల్లాసంతో నిండిపోయింది. నిజంగా వర్తమాన కాలంలో జరుగుతూఉన్న 'భార్యా — భర్తల' చిన్న — చిన్న జగడములను రచయిత్రిగారైన "ఆచంట క్రిష్ణవేణి"గారు చిత్రీకరించారు. ఈ జగడాలు సామాన్యముగా ప్రతి ఒక్క కుటుంబంలోను జరుగుతూ ఉంటాయి. అవిధమైనవారు ఈ వ్యాసమును చదివిన తరువాతైనా తమ — తమ (భార్యగాని, భర్తగాని) తప్పులను తెలుసుకొందురేమో! ఈ విధంగా సామాన్యమైన ఒక నిజమైన విషయమును విపులీకరించినందుకు 'రచయిత్రి'గారికి నా అభివందనములు.

పూడిపెద్ది లక్ష్మి (శ్రీకాకుళం)

* * *

ఏ స్త్రీకూడ సాధారణంగా భర్తకు వ్యతిరేకం చెప్పడంగాని, నడవడంగాని చేయదు. ఆదినుంచి 'భర్త'అనే పదానికి పూజ్యభావం, గౌరవం ఏర్పడింది. ఒకవేళ ఏ చిన్నవిషయంలోనైనా వ్యతిరేకంగా నడచుకున్నా— రచయిత్రి అన్నట్టు, పెళ్లాందవ స్త్రీకి ఉండవలసిన లక్షణాలు లేవని, విసుగుకుని—కసురుకుని — దుయ్యపట్టే దానికన్నా— భార్య ఆలోచన ప్రకారంకూడ ఆఖరికి అప్పుడప్పుడు భర్తకూడ నడుచుకుంటే వారి "దాంపత్యజీవితం" గతుకులులేని బాటలా సాఫీగా సాగిపోతుంది.

సి. హెచ్. పార్వతి (రామచంద్రపురం)

* * *

"దాంపత్య జీవితం" అనేది భార్యభర్తల మనస్తత్వాలపైనను, పరిసరాల ప్రభావాలపై ఆధారపడి ఉండటం సహజం. ఒకరినొకరు అర్థం చేసుకుంటే ఏవిధమైన పొరపొచ్చాలకు తావేలేదు. ఒకరు మంకుపట్టు పట్టినా, రెండవవారు సర్దుకుంటే దానికి అంతటితో సరి! కొందరు గోరంత కొండంతలుగా చేసుకొని కాపురాలను వదలుకొనడం చూస్తూనే ఉన్నాం.

సమాన హక్కులను, నేటి సమాజ పరిస్థితులను, ఆకళింపుజేసుకొని, విమర్శనాత్మకంగా వ్రాసిన రచయిత్రిగారి అభిప్రాయాలతో ఏకీభవిస్తున్నా!

శ్రీమతి కత్తుల సూర్యకాంతము (గుంటూరు)

* * *

"ఆచంట కృష్ణవేణి" గారు వ్రాసిన "దాంపత్య జీవితం" అనువ్యాసము చదివాను. ఆ వ్యాసము నా కెంతో నచ్చింది. కృష్ణవేణిగారు చెప్పినట్లే స్త్రీ పురుషు లిరువురిలో ఎవరూ—ఒకరు ఎక్కువ ఒకరు తక్కువ అనుభావం పొడచూపేలా ప్రవర్తించగూడదు. ఎప్పుడైతే ఎవరికివారు తనకు తానే, ఎక్కువఅని భావింతురో వారియొక్క సంసారము విచ్ఛిన్నమవుతుంది. ఇప్పుడు ఒక అద్దమే పగిలిందనుకోండి. తిరిగి దానిని అతికించుటకు ఎంత కష్టమో, విచ్ఛిన్నమైన సంసారము మరల దగ్గరికివచ్చుట అంత కష్టము. ఒకరి అవసరాలు ఒకరు గమనించి ఇద్దరూ (స్త్రీ పురుషులు) చేదోడు — వాదోడుగా ఉండేటప్పుడే వారి సంసారం పవిత్రంగాను, ఆనందముగాను ఉంటుంది.

ఈ వ్యాసము చదివిన స్త్రీ పురుషులు ఇప్పుడైనా వారి పట్టుదలలు వదలి మంచి మార్గాన్ని అనుసరిస్తే చాలా సంతోషము.

నన్నపనేని స్వర్ణకుమారి (గుంటూరు)

* * *

'దాంపత్య జీవితం' అనువ్యాసం బాగా రాశారు. చదువుకున్నవారికి సంస్కారము ఉంటుందన్న విషయములో నేను ఆమెతో ఏకీభవించలేకపోతున్నాను. చదువుకున్నవారు సంస్కారము లేకుండా ప్రవర్తిస్తున్న స్త్రీలు చాలామంది ఉన్నారు. చదువులేకపోయినా సభ్యత, సంస్కారము గల స్త్రీలుకూడా చాలామంది ఉన్నారు. చదువుకున్న వారిపై ఎందుకు ద్వేష మనుకునేరు? కారణం మాకు తెలిసినవాళ్లు ఒకరున్నారు. ఆమె చదువుకున్నది. ఆమె చేసిన పొరపాట్లను భర్త సవరించే నిమిత్తం 'నీవు చేసింది పొరపాటు సుమా! జాగ్రత్తగా నడుచుకో'మని చెప్పినప్పుడు తను చేసింది పొరపాటని తెలిసికూడ తన మాటనే చెల్లించుకోవాలనే పట్టుదలతో ఏవో కలతలు రేపుకుని పచ్చని సంసారాన్నికూడ లెక్కచెయ్యకుండా వెళ్లిపోయిందీ ఆలన. ఇది సంస్కారమే వంటారా! మగవారు కూడ భార్యమనస్సు అర్థము చేసుకొనక తాము మగ మహారాజులమనే అహంతో ప్రవర్తిస్తూ ఉంటారు. అటువంటి సంసారాల్లో ఇరువురూ సుఖ సంతోషాలకి దూరమవుతారు. ఎప్పుడైతే ఇరువురు ఒకరి మనస్సు ఒకరు అర్థంచేసుకుంటారో ఆనాడే వారి గృహము ఒక స్వర్గసీమగా తయారవుతుంది. వారిదే ఆదర్శ దాంపత్య మనిపించుకుంటుంది. భార్యాభర్తలు బండిచక్రాల వంటివారు. ఏ చక్రము నడవకపోయినా ప్రమాదమే. ఏమంటారు! కృష్ణవేణిగారికి నా ధన్యవాదాలు.

శ్రీమతి కన్నబాబు (బరంపురం)

## భార్యాభర్తల మధ్య పొరపొచ్చాలు

శారద గారు వ్రాసిన 'భార్యాభర్తల మధ్య పొరపొచ్చాలు' అనే వ్యాసం చాలా బాగుంది. సాధారణంగా భార్యాభర్తలు కలహించడానికి కారణం ఒకరి అభిప్రాయములు మరి యొకరికి సరిపడక పోవడం అని రచయిత్రి చక్కగా వ్రాశారు. సంసారానికి భార్యాభర్తలు రెండు చక్రముల వంటివారు. కాబట్టి ఇరువురి అభిప్రాయములు సరిపడిననాడే ఆ సంసారం సుఖమయం అవుతుంది. సాధారణంగా ఎంత అన్యోన్యంగా ఉన్న భార్యాభర్తలకైనా అభిప్రాయ భేదములు రాకుండా మానవు. ముఖ్యంగా స్త్రీలు నా మాటే పైన ఉండాలి, అతను చెప్పినట్లు ఎందుకు వినాలి అని గొడవలు పెంచుకొనేవారు చాలామంది ఉన్నారు. ప్రతి చిన్న విషయాన్ని తీవ్రంగా భావించి జీవితాన్ని నరకాన్ని చేసుకొనేవారు చాలామంది ఉన్నారు. స్త్రీ ఎంత చదువుకొన్నప్పటికీ భార్యగా తన ధర్మాన్ని బాధ్యతను గుర్తించిననాడు వారి దాంపత్యం స్వర్గతుల్య మవుతుం దనుటలో సందేహం లేదు. కుమారి పేరూరు అనంతలక్ష్మి (సామర్లకోట)

* * *

భర్త ఎటువంటివాడు అయినా భర్తను మంచి దారిలోకి తెచ్చుకొను తెలివి భార్యలోనే ఉండాలి. అట్లాగైన సంసారం చాల ఆదర్శనీయముగా ఉంటుంది. భార్యాభర్తల మధ్య పొరపొచ్చాలు నూతన దంపతుల చిట్కా అనవచ్చును.

కుంచపర్తి వీరా అన్నపూర్ణ (మంటాడ)

## పురుషులూ–పాకశాస్త్రమూ

‘పురుషులూ— పాకశాస్త్రమూ’ అను వ్యాసము విజయ సుబ్రహ్మణ్యముగారు చాలా బాగా వ్రాశారు. ఎందుచేతనంటే సామాన్యంగా ప్రతి పురుషుడూ కూడా ఏమీ పనిలేకపోయినా నేను మగవాడినికదా? నే నెందుకు పనిచేయాలి అని అతిస్వల్పమైన సహాయంకూడా చేయక, నాకు అది అందించలేదు, ఇది అందలేదు అంటూ ఇంకా స్త్రీని వేధించుకు తింటాడు. అటువంటి పురుషులందరికీ ఈ వ్యాసం పనిచేసే లాగాఉంది.

సమ్మె వెంకట లక్ష్మి (మొయ్యేరు)

‘పురుషులూ— పాకశాస్త్రమూ’ అనువ్యాసం రచయిత్రిగారు ఎంతో విమర్శనాత్మకంగా చాల చక్కగా వ్రాశారు. ఈ వ్యాసంలో రచయిత్రి భావాలతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను.

సాధారణంగా పెళ్ళిళ్లలో వంట చేసేందుకు పురుషులనే నియమిస్తారు గాని స్త్రీలను నియమించరు. ఈ విషయంలో నిజంగా ఆడవాళ్ళు అబలలని నిరభ్యంతరంగా చెప్పవచ్చు. వారు మామూలుగా ఇండ్లలో వంటలు అయితే చెయ్యగల్గుతారు కాని ఇలాంటి పెద్ద పెద్ద కార్యాలప్పుడు వంటలలో పాలుపంచుకొనలేరు. కావున ఎందుకైనా మంచిది, పురుషులుకూడా పాకశాస్త్రంలో ప్రవేశం కలిగిఉండటం ఎంతైనా అవసరమని నా అభిప్రాయం. అల్లూరు అరుణ (సూర్యాపేట)

* * *

శ్రీమతి విజయ సుబ్రహ్మణ్యంగారి వ్యాసం చాలా బాగుంది కానీ వంటలు చేయాలిఅంటే, వి. సి. ఎస్. పాసు కావాలి. అంటే “ఇండియన్ కుకింగు సర్వీసు” అన్నమాట. లేకుంటే చేతకాని పని చేసి, చేతులు కాల్చుకొని చేసినవి దిబ్బపాలుచేసి డబ్బుకు డబ్బు దండుగా, పనులకు పనులు చేటు చేసుకోవలసి వస్తుంది.

డి. హరినారాయణగుప్త (చిత్తూరు)

---

## బొమ్మల కథ — కుమారి కళ - 3 ‘దేవిక’

# మన మాటా
# మన మాటలతీరూ

కాకుమాను భారతి

"ఏ విధంగా మాట్లాడాలి...మా మాటలు ...ఎవరికీ అసహ్యకరంగాను, బాధ కల్గించేవిగాను ఉండకూడదు" అని మనం మరొకర్ని శాసించలేం! అలాగ ప్రవర్తించనందుకు మనం వార్ని దండించలేం! అదే...ఇంట్లోకి జొరబడిన దొంగనైతే శిక్షించటానికి మనకు హక్కు ఉంది! కాని ఎవరి ప్రవర్తన, ఎవరి మాటలు మనకు ద్వేషం .... బాధ కల్గిస్తాయో—వార్ని శిక్షించటానికి 'సంఘం' అనుమతించదు.

మన నిత్యజీవితంలో ఎంతోమంది కొత్తవారితో మనకు పరిచయం జరుగుతుంది! ఎందరితోనో మాట్లాడవలసిన అవసరం ఏర్పడుతుంది! అటువంటప్పుడు మన మాటలు అవతలి వారి మనస్సుని నొప్పించేవిలా ఉండకూడదు! అలా కానిపక్షంలో మన పరిచయస్తులు .... బంధువులు మనల్ని అసహ్యించుకుని దూరరే అవుతారు! అప్పుడు ఈ విశాల విశ్వంలో ఏకాకులుగానే ఉండిపోవలసివస్తుంది!

కొంతమంది మాట్లాడుతుంటే ఎంతో 'ముచ్చట' వేస్తుంది! కొన్ని గంటల తరబడి అలాగే వారితో మాట్లాడా లనిపిస్తోంది. అలాంటి వ్యక్తులు మనని ఆకర్షించగలుగుతారు. వారితోటి పరిచయం శాశ్వతంగా ఉండిపోతుంది.

మరికొంద రుంటారు! వారితోటి ఎంతోసేపు మనం మాట్లాడలేం! మాట్లాడుతున్నంతసేపు 'ముళ్ళ' మీద కూర్చున్నట్లు అనిపిస్తుంది.

ఎస్. ఇ. ఓ. గా పనిచేస్తున్న నా ఫ్రెండు ఒకామె ఉంది. ఆమె చెప్పిందే ఇది.

ఒక ఆఫీసరు భార్యతో మా ఫ్రెండుకు పరిచయం జరిగిందట! తరచు వాళ్ళింటికి వెళ్ళేదట! ఏదో సందర్భంలో ఆఫీసరు భార్య అందిట! ... "ఆడదానికి చదువు—సంధ్యలు దేనికి చెప్పండి? అదేం ఖర్మమో గాని చదువుకున్న అమ్మాయిలందరూ 'నా కప్పుడే పెళ్ళేంటి?' అంటారు ఒకవైపు పాతికేండ్లు దాటిపోతున్నప్పటికి. బి. ఏ. చదువుకున్న ఆడది తనతో సమానంగా చదివిన కుర్రవాడ్ని చేసుకోటానికి ఇష్టపడదు! ఎం. ఏ. చదువుకున్న వాడికి ఆ అమ్మాయిలో ఏవో లోపాలు కన్పిస్తాయి. తీరా నచ్చినా అతను కోరిన కట్నం ఆ పిల్ల తల్లిదండ్రు లివ్వలేరు. అలాగే చివరకు మొద్దుల్లాగ ఉండిపోతారు....."

మా ఫ్రెండుకు ఇంకా పెళ్ళికాలేదు. ఆఫీసరు భార్య అన్నమాటలకు ఎంతో నొచ్చుకుంది. కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి. ఆమెకు కన్పించకుండానే తుడిచేసుకుని బయటకు వచ్చేసింది. అది మొదలు ఆ ఇంటి ఛాయలకే వెళ్ళటం మానివేసిందట.

ఒకరోజు ఓ ఆఫీసరు భార్య (వాళ్ళింటి ప్రక్కనే కాపుర ముంటున్నారులెండి) మా పిన్నిని "మీ ఆయన ఏం చేస్తుంటాడని" ప్రశ్నించిందట. మా పిన్ని అవసరంవచ్చినప్పుడు ఆమె 'భర్త' గార్ని బహువచన ప్రయోగమే చేస్తుండేది. తన భర్త నావిధంగా సంబోధించినందుకు బాధపడినా, తప్పనిసరై సమాధాన మిచ్చింది. తిరిగి 'పేరు' అడిగిందట. మా పిన్ని అయిష్టంగానే జవాబిచ్చింది. అది విన్న ఆఫీసరు భార్య "ఓ.... అతనా! తరచు మావారి దగ్గరకు ఏవో చందాలంటూ వస్తాడు .... లావుగా... పొట్టిగా ఉంటాడు...." అని ఈ రకంగా మాట్లాడసాగిందట. అక్కడ క్షణం ఉండ బుద్ధికాక చర్రున లేచి వచ్చింది పిన్ని.

ఇలాగు ఎదుటివార్ని మాటమాటకూ కించపరుస్తూ చులకనచేసి మాట్లాడుతుంటే సహనంతో ఎన్నాళ్ళని స్నేహం చెయ్యగలం చెప్పండి.

అలాగే ప్రతి మాటలోను .... తమ 'అధిక్యతను' కనబరుస్తూ ప్రక్కవార్ని ఎత్తిపొడుపులతో కళ్ళనీళ్ళ పర్యంతం చేసేవారూ ఉంటారు. అటువంటి మాటలు ఎవరికీ రుచించవు.

ఇంకో రకం వ్యక్తు లున్నారు. అయితే వాళ్ళంత ప్రమాదం కాదు. ఉద్రేకంలో ఏమేమో అంటారు. తిరిగి మామూలు మనుష్యు లయ్యాక "ఆవేశంలో ఏదో అన్నాను. మీ మనస్సుకు బాధ కల్గిస్తే క్షమించండి!" అని వాపోతారు. అప్పుడు మనం కొంచెం కుదుటబడతాం. పొరబాటున ఎవరైనా మన కాలు తొక్కారనుకోండి. వెంటనే చేసిన తప్పు తెలుసుకొని 'సారీ! చూడలేదు' అంటే ఫర్వాలేదు. కొంతవరకైనా ఓర్చుకోవచ్చు ....!

ఇంతకీ నా అభిప్రాయం ఏమంటే .... మాట్లాడటంలో ఏమైన పొరబాట్లు ఉంటే తెలుసుకుని క్షమార్పణ కోరుకుని ఎలాగో సరిదిద్దుకోవచ్చు. వంకర టింకర 'ధాళ్లను' కూడ కొట్టి, చదును చేయవచ్చును. కాని వక్రించిన మనసుని సరిచెయ్యటం ఎలాంటివారికైనా సాధ్యంకాదని ....!







## నిత్య సంధ్య!

ప్రతిరోజూ ఆమె వస్తుంది
ప్రియునికోసం నిరీక్షిస్తుంది
ఆమె ఆగమన సందేశాన్నందించి కర్మసాక్షి
పోతాడు.
పక్షులన్నీ ఆమెకు స్వాగతవచనాలు పలుకు
తాయి.
చెట్ల ఆకులు రెపరెపలాడుతూ బృందగానం
చేస్తాయి.
మందమారుతం వింజామర వీస్తుంది
కెరటాలు సంగీతస్వరాల నాలాపిస్తాయి
ఆకాశం కుంకుమ వెదజల్లుతుంది.
ప్రకృతి ఆమెరాకకోసం తహతహలాడు
తుంది.
ముచ్చటగా అలంకరించుకొని ఆ ముగ్ధ
వస్తుంది
వేయి కన్నులతో ప్రియునికోసం ఎదురు
చూస్తుంది.
నిర్నిమేష దృష్టితో ఎదురు చూస్తుంది
ప్రియుడు వచ్చేవేళ అవుతుంది
ఆమె మురిసిపోతుంది.
శరీరం పులకరించి పోతుంది.
ప్రియుడు వస్తాడు సౌందర్యమూర్తియై
వస్తాడు
కానీ ఏదీ ఆమె? ఎక్కడ మాయమవుతుంది
ఆమెస్థానం ఎవరో ఆక్రమించుకుంటారు.
ఆమెకు మధుర సాంగత్య సౌభాగ్యములేదు
ప్రతినిత్యం నిర్నిమేష ప్రతీక్ష తప్పదు
అయినా ఆమెకు విసుగులేదు
ప్రియునిమీద కోపమూ లేదు
తన అదృష్టం ఫలించలేదనుకుంటుంది
అందుకోసమే ఎదురుచూస్తుంది.
అందులోనే ఆమె కానందం
అవధులులేని ఆనందం,
ప్రతిరోజూ ఆమె వస్తుంది
ప్రియునికోసం నిరీక్షిస్తుంది.

దేసూరి రామారావు.

* * *

## టాయ్! టాయ్! ఉంటాయ్!!

టాయ్! టాయ్! టాయ్!
ఉంటాయ్! టాయ్! టాయ్! టాయ్!
ఈడూ జోడూ ఉంటేగా
ఇంపూ సొంపూ తెలిసేది!
చదువూ సంధ్యలు ఉంటేగా
సరసం విరసం తెలిసేది!
అణగీ మణగీ ఉంటేగా
అందం చందం తెలిసేది!
పిల్లా జెల్లా ఉంటేగా
పేరూ పెంపూ ఉండేది!
రాళ్లూ రప్పలు ఉంటేగా
ఇళ్లూ గుళ్లూ కట్టేది!
పాడీ పంటలు ఉంటేగా
పరువూ గిరువూ నిలిచేది
గుట్టూ మట్టూ ఉంటేగా
చెలిమీ కలిమీ నిలిచేది.

సి. హెచ్. శివ (విజయనగరము.)

* * *

## చాలు ?

"వినుట కొరకు చెవి చాలు,
కనుట కొరకు కన్ను చాలు,
ఆఘ్రాణించుట కొరకు ముక్కు చాలు,
కాని, నవ్వుట కొరకు నోరు చాలదు
సుమా!"
[32 పళ్లు కావాలి అని తాత్పర్యం.]

ఎమ్. ఎమ్. ఖాన్ (రాజమండ్రి)



# "నేనూ–మహారాజుగారూ"

## గ్రేస్ కెల్లీ

తానొకటి తలిస్తే దైవం వేరొకటి చేస్తాడంటారు. మంచికీ చెడ్డకీ కూడా ఈ మాట చెల్లుతుంది. గ్రేస్ కెల్లీ తండ్రి మొదట తాపీ మేస్త్రీ, ఆనక కాంట్రాక్టర్. ఐనా తాను "తార" నౌదామనుకుంది. అందమైందీ ప్రతిభ ఉన్నదీ అయిన గ్రేస్‌కు అదేమంత కష్టంగాదు గాని అదృష్టంవచ్చి ఆమె అందలమే ఎక్కింది. వెండితెరనుంచి మొనాకో రాణిగా పసిడి సింహాసన మధిష్ఠించిన గ్రేస్ కెల్లీ సంసారిక జీవితం 'కథ'లాగే ఉంటుంది. ఆమె సన్నిహితులూ, ఆప్తులూ ఐన వారినుంచీ, ఆమె స్వయంగా చెప్పిందాన్నిబట్టీ రూపొందించిన ఈ విశేషాలు 'కథ'కంటే నిజాలే కథల్లాగ, కమ్మగా ఉంటాయనిపిస్తాయి.

"రాజా, నేనూ"

"మొనాకో" రాణి గ్రేస్‌కెల్లీ చెప్పేమాట లివి. ఆమె ఎప్పుడూ "నేనూ ఆయనా (మొనాకో ప్రభువు) ఇలాచేశాం" "రాజా నేనూ ఇలా చేద్దా మనుకుంటున్నాం" అని చెబుతూంటుంది. తాను వియ్యానికైనా కయ్యానికైనా రెండు చేతులు కలవాలి అన్నట్లు యిద్దరి మధ్య పొత్తు పొందికా కుదిరితేనేగదా సంసారంఆనందమయమయ్యేది.

అమెరికాలో స్త్రీలకు గల సమాన ప్రతిపత్తి మరో దేశంలో ఎక్కడా లేదనే అంటారు. అక్కడ పెళ్లి అనేది ఒక భాగస్వామ్యం లాంటిది. గ్రేస్ కెల్లీ పెళ్లి చేసుకొని ఒక ఏలిక భార్య కాకమునుపు పూర్తిగా అమెరికనే. ఆమె పుట్టిన యిల్లు, 'ఫిలడెల్ఫియా'లో వున్నది. వాళ్ల తండ్రి తాపీ మేస్త్రీ. ఆనక లక్షల కధికారి అయ్యాడు లెండి.... అతను కట్టిన ఎర్ర యిటుకల యింట్లోనే 'గ్రేస్' జననం—

సరే ఇక రాజకుమారుడు 'రైనీర్' చాలా రాజవంశం, రాజసం గలవాడు. "మూడవ రైనీర్" యొక్క వంశస్థుల చరిత్ర పన్నెండో శతాబ్దపు ఐరోపా చరిత్రనాటి నుంచి లభ్య మవుతున్నది.

కాని ఈ ఇద్దరి మధ్య ఈ అనుబంధం యేర్పడ్డది!

గ్రేస్ "ఒప్పుకొంటుంది." రాజమందిరంలో అంతా రాజుగారి పెత్తనం ఉంటుంది. మార్పులూ, కూర్పులూ రాజుగారే చేస్తాడు. అంటే దీనివల్ల ఆమె తన స్వేచ్ఛను కొంత పోగొట్టుకుంటున్నదా అంటే "అప్పుడప్పుడు తప్పదు" అంటుంది గ్రేస్ కెల్లీ. కాని వెంటనే "చాలా వరకూ తన ఇష్టానిష్టాలూ, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు భంగం కావనే" ఆమె చెప్పింది.

నిజంగా రాణీ గ్రేస్ కెల్లీగా మారిన ఈమె ఈ ఐదేళ్లలోను ఎంతో ఎదిగిపోయింది. మొనాకోలోని జీవితం, మాతృత్వం, సంసారం ఆమెలోని ఈ మార్పుకు కారణాలు. అలాగే ఈ రాజ్యంలో ఎవరేనా సరే, రాజకుమారుని విషయంలో కూడా 'మార్పు' ను అంగీకరిస్తారు. పట్టపగ్గాలు లేని ఒట్లుండే బ్రహ్మచారి వేరు; ఆ తర్వాత పెళ్లయిన గృహస్థుగాను, తండ్రిగాను అగుపిస్తున్న రైనీర్ వేరు.

తనకు సంసారమంటే మమకారం ఏర్పడ్డదని, తాను సంసారినై పోయానని, రాజు ఒప్పుకుంటాడు. పిల్లలతో హాయిగా ఆనందంగా ప్రత్యేకారామంలో ఆయన గడుపగా చూసినవారున్నూ అదే అంటారు.

వాస్తవానికి గ్రేస్‌కెల్లీ, ప్రపంచంలోని తతిమ్మా జమీందారిణులు, రాణులకన్నా చాలా రెట్లు పెద్ద బిరుదు, 'హోదా' గలది. ఎందుకంటే మొనాకో రాణిగా ఆమె హోదా డచ్చెస్‌కన్నా పెద్దది. కౌంటెస్‌కన్నా తొమ్మిది రెట్లు ఎక్కువ. మార్క్వెస్ కన్నా ఈమె 'పదవి' మూడు రెట్లు హెచ్చు.

గ్రేస్‌కు ఇప్పుడు 31 సంవత్సరాల వయస్సు. ఐనా వన్నె తరగలేదు. మిసమిసలాడే అందం, చురుకైన నవ్వు ఆమెలో తొణికిసలాడుతూ ఉంటాయి.

ఆమె తన బంగారు కేశాలను ఇదివరకు పొడుగ్గా ఉంచుకునేది గాని ఈమధ్య అధునాతనంగా, అలగ్జాండ్రే (పారిస్ ఫాషన్) కనిపెట్టిన విధానంలో కత్తిరించుకుని అలంకరించుకుంటున్నది.

"ఏమో మరి! యిదివరకు పొడుగ్గానే అల్లుకునే దాన్ని, ఇప్పు డిలాగ చేస్తున్నాను. నాకేది నచ్చిందో నాకే తెలియదు" అంటుం దామె.

ముడి వేసుకొని కొప్పు అమర్చుకోకపోయినప్పటికీ, ఆమెలో హంసవంటి అందం, మృదుత్వం మరీ ఇనుమడించి ఉన్నాయి. సరోవరాలు, కేళీ విలాసాలూ ఇత్యాది ప్రణయకాండ అంతా ఇంకా అలాగే ఉన్నట్లు ఇద్దరు పిల్లల తల్లి ఐనా 'గ్రేస్' లో అగుపిస్తుంది.

గ్రేస్, రైనీర్‌ల కన్నుల పండువుగా జన్మించిన కారొలిన్‌కు నాలుగేళ్లు. తల్లి దగ్గర్నుంచి అందం, నటనాచాతుర్యం, వాళ్ల నాన్నగారి చమత్కారం, 'మిమిక్రీ' (అనుకరణా కౌశల్యం) ఆ పిల్లకు పట్టుబడ్డాయి. రాజా రైనీర్ ఏ దేశం ఉచ్చారణనైనా అనుకరించి చమత్కారంగా మాట్లాడుతూఉంటాడు. ఒక్కోసారి ఐరిష్, అమెరికన్, ఫ్రెంచి, ఏసలో మాట్లాడి కుటుంబంలో సంతోషంగా గడపడం అతని సరదా. ఎవరి గొంతుకలోనైనా మాట్లాడి విన్నవాళ్లను చకితులను చేయగలడు రాజా.

—41 వ పేజీ చూడండి



మొనాకో రాణి గ్రేస్ కెల్లీ



## జరిగిన కథ

నిచుళానగరంలో శృంగారమంజరి రెండవ కుమార్తె హేమసుందరి. ఒక అర్ధరాత్రి ఆమెను కలుసుకొనవచ్చిన రంగనాయకుడు, కావలివారిని గాయపరిచి పోతాడు. గజదొంగ అనుకుంటారు నగరవాసులు. తలారి వేశ్యమాతతోపాటు కుమార్తెల నిద్దరిని దొంగతనం సంగతి విచారిస్తాడు. మాణిక్యవల్లి హేమసుందరీ రంగనాయకుల రహస్యం తిరుమలరెడ్డికి చెబుతుంది. స్నేహితుడు గోపాలయ్య ఎంత చెప్పిన వినక రంగనాయకుడు, హేమసుందరి కోసం ఆలయగోపురంమీదకి పోయి సింహాచలాన్ని ఎదుర్కొని బలమైన గాయాలతో ఇంటికి చేరుకుంటాడు. తిరుమలరెడ్డి ద్రోహం తెలుసుకున్న మాణిక్యవల్లి హేమసుందరీ రంగనాయకులు కలుసుకునే ఏర్పాటు చేయాలని సంకల్పించుకుంటుంది. నాంచారమ్మ సాయంతో రంగనాయకుడు హేమసుందరిని కలుసుకుంటాడు. తిరుమలరెడ్డి ఇంట్లో దొంగతనం జరుగుతుంది. రంగనాయకుడు హేమసుందరి శ్రీరంగంకు పారిపోతారు. హేమసుందరి కన్యగాదని రంగనాయకుడు తెలుసుకుంటాడు.

## 14

అంత గొడవ అయిన తరవాత కూడా రంగనాయకుడు తన వివాహసంకల్పం విరమించుకోలేదు. ఇంకొకసారి హేమసుందరితో ఆ సంగతి ప్రస్తావించాడు. ఆమె కొంతసేపటివరకు విని విననట్టు మాట్లాడక కూరుకుని 'మూడు ముళ్ళు వేసి మంగళసూత్రం కట్టగానే అది మనువయిపోతుందా ఏమిటి? నిజమయిన మమకారమే ఉంటే మంగళసూత్రా లెందుకు? .... అయినా మీ ఇష్టం! నా అభ్యంతరం ఏమి లేదు! పీటమీద కూర్చోబెట్టి పెళ్ళి చేయిస్తానంటే చేదా

37 వ పేజీ ...

# చదువుల్రావు





గట్టిగా అరవకు బహుశా గూబ బద్దల
కొట్టేయగలదు ఆ అమ్మాయి ఎవరూ
అని అడుగుతున్నావు కదూ! మాము
కెపుడ చెబుతా...




మొదట్లో మా కాలేజీలో మంచి రోడ్లు ఉండేవి
కావు నడవడానికి చాలా ఇబ్బందిగా ఉండేది
తరువాత కొన్నాళ్ళకి కంకర రోడ్డు వేద్దామని
రోడ్డుమీద కంకర వేశారు కంకర వేశారే కానీ




ఆ తరువాత రోడ్డును చేయడానికి రోలరు రావ
కలేదు. ఇదిలా ఇలా ఉండగా. ఒక మంచి ముహూర్తా
న, మా కాలేజీలో ఈవిడ చేరింది. చేరేకా కొన్నాళ్ళు
కాలేజీకి మామూలుగా నడిచి వస్తూండేది అలా
కొన్ని రోజులు ఆ కంకర రోడ్డుమీద ఆ అమ్మాయి




నడిచే సరికి ఆ రోడ్డు సిమ్మెంటు రోడ్డులా బాగా
చదునైపోయింది. అప్పటినుంచి ఆ రోడ్డుమీద మేము
బాగా నడవగలుగుతున్నాం. అందుకనే క్రిందటేడాది
ఈ అమ్మాయి "బెస్టు సోషల్ వర్కరే" అని
పెద్దకప్పుని మా కాలేజీ
లో ప్రెజెంట్ చేసేరు.
మావాళ్ళు
ఏంకాలత్రా
నాయనా!!!
సత్యమూర్తి

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

# వారఫలాలు

దైవజ్ఞపాతూరి శ్రీరామమూర్తి

28-9-1962 శుక్రవారము మొదలు
4-10-1962 గురువారము వరకు

## మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఏ కాలు ముందుపెడితే ఏమి జరుగుతుందో నసే సందేహం మిమ్ములను పట్టుకుంటుంది. ఆత్మ తృప్తిలేని పనులు చేస్తారు. మీ గౌరవస్థానం చెడదు. కాని, పనుల హడావుడిలో పొరపాటు జరిగే సమయం. ఆదాయం మామూలుగానే ఉంటుంది. పరోపకార బాధ్యతలు అధికమవుతవి. వృత్తిలో తోటివారి మంచితనము, పరస్పర సహకారంతో పనులు సాగించగల అవకాశము లభిస్తవి. వారం రెండవభాగంలో ఆరోగ్య విషయంలో శ్రద్ధ వహించండి. క్రొత్తగా ఆరంభించ దలచిన కాంట్రాక్టులు, వ్యాపారాలు మొదలయిన పెట్టుబడితో కూడిన పనులలో కీడెంచి మేలెంచమనే విషయాన్ని గుర్తించుకొనండి. విద్యార్థులకు అనుకూలమైన సమయం.

* * *

## వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

మీ సామర్థ్యాన్ని ఉపయోగించుకొనటానికి మంచి అవకాశం లభిస్తుంది. మీ మాటలో న్యాయమున్నదనే నమ్మకం కలగటంవల్ల లోకుల మాటలను లెక్కపెట్టకుండా ధైర్యంతో ముందుకు పోగలుగుతారు. మధ్యమధ్య మీ ఆలోచనలలో మార్పుదల వచ్చినా క్రియలో మార్పుఅనేది ఉండదు. గౌరవప్రదమైన కాలమే గాని, శారీరకంగా శ్రమ అధికం. సాహసాలు, గృహములు కొనే ప్రయత్నాలకు అనుకూలమైన కాలం. ఏ వ్యవహారంలోనైనా ధైర్యంతో ప్రవేశించి జయం సంపాదించగలుగుతారు. విలాస, వినోద కార్యక్రమాలలో పాల్గొనే అవకాశం లభిస్తుంది. వృత్తికి సంబంధించిన కార్యక్రమాలలో మార్పులకు అలవాటు పడవలసి వస్తుంది.

### గ్రహస్థితి

మిథున కర్కాటకాలలో అంగారకుడు, కర్కాటకంలో రాహువు, కన్యలో సూర్య బుధుల్కు, తులలో శుక్రుడు, మకరంలో శని కేతువులు, కుంభంలో గురువు, కన్య తుల వృశ్చికాలలో చంద్రుడు.

* * *

## మిథునం :

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

దైవానుగ్రహంవల్ల మీ భారం క్రమంగా తొలగించుకొనగల అవకాశాలు వస్తవి. కలహభయం తొలగిపోతుంది. వృత్తిలో ఆదాయంకన్నా మంచిపేరు లభిస్తుంది. రావలసిన ధనం ప్రశాంతంగా చేతికి వస్తుంది. మీ మాటను కాదనేవారు క్రమంగా అణగిపోతారు. ఉత్తరములద్వారా తెలిసే వార్తలు ఆదుర్దా కలిగించునట్లుగా ఉండవచ్చు. స్నేహితులమీద ఆధారపడిన పనులు విదాంగా జరుగుతవి. మీవద్దనుంచి విషయంగ్రహించి మిమ్ములను సోధన చేయటానికి చూచేవారుంటారు. ప్రసంగాలలో నిబ్బరం కలిగిఉండవలసిన సమయం. అధికారులవల్ల పనులు పూర్తికాకుండా తెగకుండా సందిగ్ధ స్థితిలో నిలుస్తవి. వారం రెండవభాగంలో దైవకార్యాలు నెరవేరుతవి.

* * *

## కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

మీ సుఖాన్ని కాపాడుకొంటారు. మీ క్షేమం కోరే మిత్రులు లభిస్తారు. వ్యవహారాలు మీరు తలచినంత చురుకుగా పూర్తికావు. వృత్తిలో భాగస్తుల వంటివారి సలహా, సహాయము లభించినా, మీరు స్వయంగా నిర్వహించవలసిన పనులు విశేషంగా ఉంటవి. ముఖ్యబంధువులవల్ల నెరవేరవలసిన పనులు ప్రస్తుతానికి వాయిదా పడగలవు. మోసగాండ్ర మాటలు నమ్మి మీ డబ్బునుగాని, ముఖ్యమైన కాగితాలుగాని ఇతరుల చేతికి పోనీయవద్దు. కుటుంబంలో చిన్నచిన్న భేదాభిప్రాయాలు పొడచూపగలవు. కాని, అందువల్ల ఏ కార్యక్రమాలకున్ను చిక్కులు ఏర్పడవు. సంఘ కార్యాలలో విసుగుదల తోచగల సమయం.

* * *

## సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

బాహ్యవిషయాలలో పేరు ప్రఖ్యాతులు, గొప్పదనము బాగుంటవి. కాని, అనవసరమైన భారం పైనవేసుకొన్నామనే భావం తోస్తుంది. ఏదో విధంగా కావలసిన ధనం సమకూర్చుకో గలుగుతారు. ప్రయాణాలు సంతోషప్రదంగా జరుగుతవి.

మృదువుగా మాట్లాడి పనిని సాధించుకొనవలసిన సమయం. ఎప్పటి కప్పుడు పనుల తొందర అధికంగా ఉంటుంది. సాహిత్యము, సంగీతము మొదలయిన వాటియందు కృషిచేయువారికి మంచి శక్తి, ప్రోత్సాహము లభిస్తవి. విద్యారంగంలో అభివృద్ధికరమైన సమయం. చట్టా వ్యాపారంవంటి పనులలో ఆశపడటం మంచిదికాదు. వారాంతంలో విశ్వాసంగా కలహాలు రాగల అవకాశాలున్నవి.

* * *

**కన్య :**

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

సాధారణంగా ఏ విషయంలోను కొరతపెట్టుకొనవలసిన అవసరం ఉండదు. మీ పనులలో జరిగే లోపాలను సవరించుకొని, మీ పేరుకు భంగం కలుగకుండా చేసుకొంటారు. కార్యరంగంలోని ప్రతికూల వాతావరణం తొలగిపోతుంది. ధనాదాయం వృద్ధిఅవుతుంది. శుభకార్యాలు నిరాటంకంగా జరుగుతవి. ఎప్పుడో అడుగున పడిపోయిన వ్యవహారాలు కదలికకు రావటంవల్ల పనిఎక్కువగా తోస్తుంది. కోర్టుకచేరీలలో యుక్తితో మీ మాట నిలబెట్టుకుంటారు. సమయానుకూలంగా అల్పులతో చేరవలసిన అవసరం కలుగవచ్చు. జాగ్రత్తగా ఉండండి.

* * *

**తుల :**

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి. విశాఖ, 1, 2, 3 పాదాలు)**

మీరు ఎంత జాగ్రత్తగాఉన్నా ఇతరుల దుష్ట స్వభావం మీ మీద కొంతవరకు పనిచేసే అవకాశాలున్నవి. మీ కార్యక్రమాలలో పాల్గొని సహాయం చేసేవారికి అడ్డు తగిలే వారుంటారు. గ్రహబలం వల్ల ఏ విషయంలోనూ కష్ట నష్టాలకు గురికావలసిన అవసరం కలుగదు. బంధువర్గంలో ఒకరిద్దరు మీ మాటలకు విపరీతార్థంచేసి నిష్ఠురాలు మాట్లాడుతారు. వృత్తి వ్యాపారాలలో శక్తికి తగిన పని, తృప్తికరమైన ఫలితము ఉంటవి. కొన్ని ముఖ్యమైన పనుల విషయంలో ముందు అశ్రద్ధ చేసి, పిమ్మట పశ్చాత్తాప పడటం జరుగుతుంది. శుభ పుణ్య కార్యాలు చక్కగా జరుగుతవి. కొంచెం ఆలస్యం జరిగినా ఒప్పుకొన్న పనులను చక్కగా నెరవేర్చి గౌరవం పొందగలుగుతారు.

* * *

**వృశ్చికం:**

**(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)**

ఒక మాట మాట్లాడితే తక్కువ, రెండు మాట్లాడితే ఎక్కువ. అయితే ముందే మీరు దూరదృష్టితో మెలగటంవల్ల సమస్త విషయాలలోను సమంజసంగా జరుపుకోగలుగుతారు. ముందుకన్నా ఖర్చులు కొంచెం అధికంగా తోచవచ్చు. మీ ఉద్యోగ నిర్వహణ మొదలయిన కార్యక్రమాలు సాఫీగా జరిగిపోతవి. మనోధైర్యము, శాంతి లభిస్తవి. ఆహార విహారాలలో అలక్ష్యంగా ఉండతగిన సమయంకాదు. ధన గౌరవాలు క్రమక్రమంగా పెరుగుతవి. మీక్రింద పనిచేసేవారితో స్పర్థలు తలెత్తగల సూచనలున్నవి. వారాంతంలో దుర్వార్తలు తెలుస్తవి. నిరుపయోగమైన ఖర్చులు.

* * *

**ధనుస్సు :**

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

పూర్తిగా అనుకూలమైన కాలం అని అనుకోటానికి వీలుకాదు. కాని, శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. సంఘంలో అక్కడక్కడ వచ్చిన పేచీలను సరిచేసుకొని పదిమందిలోను గౌరవం పొందగలుగుతారు. ఆదాయంకన్నా వ్యయం అధికం. తలపెట్టిన పనులు జరుగబోయే ఆఖరు నిముషం వరకు ఏ విధమైన సూచనా కనుపించదు. అయితే సమయానికి అన్నీ సమకూడుతవి. ధైర్యంతో పనిచేయగలుగుతారు. ఈ వారం ప్రయాణ సూచనలున్నవి. పిల్లల ఆరోగ్యం గురించి జాగ్రత్తగా ఉండండి. వివరం తెలుసుకోకుండా ముందు ఖర్చుచేసి అవసరంవచ్చిన సమయంలో ఆదుర్దా పడతారు. ఎదురుచూస్తున్న వార్తలు అందవు.

* * *

**మకరం :**

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

ఎవరు ఏది చెప్పినా ఆ సమయంలో నిజమేననుకొంటారు. అందువల్ల వృథా శ్రమపడుతారు. వ్యవహారాలు అనుకూలిస్తవి. వ్యాపార రంగంలో నిష్కర్షగా మాట్లాడకపోవటంవల్ల ఫలితం తగ్గే అవకాశాలున్నవి. బంధు మిత్రులకు హామీ ఉండటంకాని, ఒకరి నిమిత్తం మరొకరిని శ్రమపెట్టటంవంటి బాధ్యతాయుతమైన పనులను తగ్గించుకొనటం అవసరం. కుటుంబంలో క్రొత్త మార్పులు ఏమీ ఉండవుకాని, ఒకరిని ఒకరు అర్థంచేసుకొని ప్రశాంతంగా ఉండగలుగుతారు. వారం రెండవభాగంలో ఆదాయం బాగుంటుంది. పుణ్య కార్యాలు నెరవేరుతవి. విలువగల వస్తువులు కొంటారు. స్నేహితులు మిమ్ములను నిష్ఠురాలు మాట్లాడతారు.

* * *

**—ఈ వారము ధరలు—**

బంగారు ధర వారం చివరిభాగంలో మందీ వస్తుంది. వెండి ధర ఈ వారంలో కొద్దిగా పెరుగుతుంది. పసుపు ధర కొద్దిగా పెరుగుతుంది. కర్పూరంధర తగ్గుదలలో ఉంటుంది. మిర్చికి ముందు గిరాకి కనుపించి పిమ్మట కొద్దిగా మందీవస్తుంది. నూవులకు వారాంతంలో ధర వస్తుంది. వేరుశనగనూనె ధరలో నిలకడలేకుండా పోతుంది. జాగ్రత్తఅవసరం.

**కుంభం :**

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

ఎదురుగా ఉంచుకొని తినలేకపోయిన మాదిరిగా ఉంటుంది. పదిమందీ బాధ్యతలను మీ మీదకు నెట్టటానికి చూస్తారు. మీకు న్యాయంగా సహాయం చేయవలసినవారు వక్రమార్గంలో పోయే సూచనలున్నవి. గతకాలంలోని చిక్కులను తప్పించుకొని విశ్రాంతి తీసుకొంటారు. క్రొత్త మనుష్యులసంబంధం మొదట కొంచెం విసుగుతోచినా చివరకు ఉపయోగకరంగా ఉంటుంది. కుటుంబంలో సంతోషకార్యాలు జరుగుతవి. మధ్యవారి మాటల వల్ల ఒకరిద్దరు మిత్రులు మీయందు అవిశ్వాసంగా ప్రవర్తించగల సమయం. ఋణభారం వంటి బాధ్యతలు పైన పడకుండా చూచుకొనండి.

* * *

**మీనం :**

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)**

"ఆత్మబుద్ధి సుఖంచైవ" అనే విషయం మరవవద్దు. ఆదుర్దాసమయాలలో తోచక పోయినా కొంచెం ఓర్పు వహిస్తే అన్నివిధాలా సుఖం లభిస్తుంది. ముందు నిర్ణయించుకొనక పోయినా, కార్యక్రమాలలో లోపం జరుగదు. వృత్తిలో అధికారుల ప్రోత్సాహం బాగా లభిస్తుంది. దైవకార్యాల నిమిత్తం ప్రయాణాలుచేస్తారు. మిమ్ములను సహాయంకోరినవారు మీ అవసరం లేకుండా పనులు నెరవేర్చుకుంటారు. ఈ వారంలో ముందుగా మీరు చేయవలసిన పనులను, మీ శక్తి సామర్థ్యాలను అంచనా వేసుకొనుట అవసరం. తూర్పు, ఉత్తర దిక్కులనుంచి ధనలాభం కలుగుతుంది. సంఘంలో పెద్దరికం పెరిగినట్లు కనుపించినా, చిన్నచిన్న ప్రతిబంధకాలు, మానసికంగా ఉద్రేకము వస్తూ ఉంటవి. 

రోజంతా చల్లగా మరియు
సువాసన వెదజల్లుతూ ఉండుటకు

# పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ వాడండి

పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ ఎంతో మెత్తగా, పుష్పమువలె తాజాదనమును మరియు సువాసనను కలిగి వుంటుంది! ఇది చికాకును కలిగించే చెమటను త్వరగా పీలుస్తుంది. మీరు రోజంతా సువాసన వెదజల్లుతూ హాయిగా ఉండుటలో సహాయపడుతుంది. దీనిని అన్ని కాలములలోను ప్రతి రోజు ఉపయోగించండి!







చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఏ.లో స్థాపించబడినది) (WT-P 1279)



# సరాగమాల

వి ఎ కె రంగారావు

(గత సంచిక తరువాయి)

కొన్నినెలల క్రిందట వేంకటేశ్వరమాహాత్మ్యాన్నే "భగవాన్ బాలాజీ"గా హిందీలోకి అనువదించారు. దానికీ పెండ్యాలే సంగీతం అమర్చారు. ఆ హిందీ చిత్రంలో ప్రసిద్ధ హిందీ నేపథ్య గాయకీ గాయకుల పాటలు గల రికార్డులన్నీ ఒక ఎత్తు. శాంతకుమారి పాడిన "గోపాలానంద – గోపాల" ఒకప్రక్క, మరొకప్రక్క ఎస్వరలక్ష్మి పాడిన "శ్రీ దేవి హమ్ తేరి అర్ధాంగిని" (శ్రీదేవిని నీదు దేవేరిని) ఉన్న రికార్డు ఒక ఎత్తు.

శాంతకుమారి హిందీ మాటలను ఎంత స్పష్టంగా స్వచ్ఛంగా ఉచ్ఛరించారనుకున్నారు? పంచదార పల్లాల తేటదేరిన తేనెవాకలా. ఔత్తరాహుల ఉచ్ఛారణకు, వీరికీ ఇసుమంతైనా తేడా లేదు. వరలక్ష్మి పలుకుటలోవున్న ఈ షణ్మాత్ర లోపమూ మందార మకరంద మాధురీ వాహినియగు వారి గాత్ర ప్రవాహాన తెలియరాదు. ఇక స్వరకల్పన గురించి: పెండ్యాల వారి నైపుణ్యం సంగతి అందరికీ తెలిసినదే. మొదటి పాటకు పీలూ—కాఫీ రాగాలు అపూర్వంగా మిశ్రం చేశారు. గుమ్మపాలు, కమ్మతేనె; నిమ్మనీరు, వట్టివేరు. రెండవదానికి సారంగ ఛాయలతో అమీర్ కల్యాణికి రంగులు దిద్దారు. వేల తారల విచిత్ర కాంతుల నలదుకున్న వసంతాకాశం. మన తెలుగువారు పాడిన హిందీపాటలు తప్పక విని, కొనవలసినవి. కొని వినవలసినవి. నంబరు జి. ఇ. 33536. సర్వసాధారణంగా ఈ రికార్డు డీలర్లదగ్గర ఉండదు. కాని, ఆర్డరిస్తే సరస్వతీ స్టోర్స్‌కి వ్రాసి, వారం లోపల తెప్పించి ఇస్తారు.

శాంతకుమారి పాడినదే ఒక పాట "సిరిసంపదలు" లోనిది, ఈ నెల మొదటివారంలో విడుదలైనది. నంబరు ఎన్. 69716. "చిట్టి పొట్టి పాపలు, చిరు చిరు నవ్వుల పూవులు" అని పల్లవి పూర్తయిన తరువాత వినబడే తబలా ధరువులు నిజంగా చిన్ని పాపల సంబరాల పరుగుల సవ్వడులే. "గోపాలునికి గోకులమందూ పాలూ, వెన్నా తిని నంతా, యశోద వాని కడుపును జూచి పెట్టిన పోగే బలమంతా" అన్న ప్రౌఢ సౌందర్య వాగ్ధోరణి ఆత్రేయ కవిత్వానిది కాక, మరొకరిదవుతుందా! అన్ని పాటలకు సాహిత్యం భేషుగ్గా ఉండి, వరసలు అంతంత మాత్రంగావేఉన్న ఈ సినిమాలో పై పాట మేటి. తక్కినవి దీనితో చేయలేవు పోటీ. దీని కిదే సంగీతంలోనైనా, స్వరములోనైనా, లోసాహిత్యములోనైనా సాటి. శాంతకుమారి కంఠం ఆత్రేయ రచనలో పెంచిన వారి ప్రేమ మాత్ర— మాత్రలో, మాట—మాటలో వెల్లువలై విరిసి ప్రవహిస్తున్నది.

రెండవప్రక్క ఘంటసాల, సుశీల పాడిన యుగళగీతం "ఎందుకూ సిగ్గెందుకూ." ఆత్రేయ పదాల వరవడి "చిన్ననాటి చిలిపి తలపు ఇన్నాళ్లకు వలపు పిలుపు" అన్నకడ ప్రేమామృత ప్రవాహంలో తాదాత్మ్యం జెందినది. వరసలోను ఏమీ కొత్తదనం లేకపోయినా, పాత వాసన రానందుకు, పాడుకోవటానికి సులభంగా ఉన్నందుకు, పుల్లయ్య గారి చేతిలో ఈ సన్నివేశం రసవద్ఘట్టంగా రూపొందినందుకు, ఈ పాట ప్రజాబాహుళ్యపు ఆమోద ముద్రను పొందవచ్చు. ఇద్దరూ చిలిపి వలపుల తలపులు ఒలకబోసుకుంటూ పాడారు.

ఈ వారపు జవాబులు:—

పాశర్లపూడి శ్రీరాం గారికి: భార్యాభర్తలు చిత్రంలో క్రైటిల్స్ చూపుతున్నప్పుడు, తరువాత నాయికా నాయకులు గదిలో ఉండగాను "ఇద్దరు మిత్రులు"లోని "హలో హలో ఓ అమ్మాయి" వరస వినిపించినదని వ్రాశారు. నేనా విషయం గమనించలేదుగాని, అసలు రహస్యం తెలిస్తే ఇందులో వింతేమీ లేదు. ఆ వరసకు మూలము "ముస్తఫా" అనే ఇంగ్లీషు పాట. అసలు దీనికి ఆధారం "ఏనో చిరా" అనే ఈజిప్టుదేశపు గీతమనుకోండి, అది వేరే సంగతి. "ముస్తఫా" పాటను రాజేశ్వరరావు ఏ సినిమా హాల్లోనో వేయగా వినిఉంటారు. బాగుందని "భార్యా భర్తలు" బ్యాగ్రౌండ్‌లో వాడిఉంటారు. తిరిగి వినగా తమకే తోచిందో, లేక నిర్మాతలకే ఆ బుద్ధిపుట్టిందో, పాటగా "ఇద్దరు మిత్రులు"లో దింపిఉంటారు. అదీ సంగతి. అంతే సంగతి.

బరంపురం లలితాశర్మగారికి: ఎ. వి. ఎం. వారి "జీవితం" చిత్రానికి సంగీత దర్శకులైన ఆర్. సుదర్శనం తరువాత ఏ చిత్రానికైనా పని చేశారా అని అడిగారు. చేయకేం! ఆ తరువాత ఆ స్టుడియో నుంచి వచ్చిన చిత్రాలన్నిటికీ, వారూ, వారి సోదరులైన ఆర్. గోవర్ధనం కలసి పనిచేశారు. తమాషా ఏమిటంటే ఒక చిత్రానికి ఒకరు సంగీత దర్శకులూ, మరొకరు సహాయకులూ అని వేసి, రెండవ చిత్రానికి అటునుంచి ఇటు వేసేవారు. ఆ చిత్రాలు "వదిన", "జాతకఫలం", "భూకైలాస్", "సంఘం", "కాళహస్తి మహాత్మ్యం", "సదారమ"లో వీరేనని గుర్తు. కొన్ని సంవత్సరాల క్రిందట, అంటే నాలుగేళ్లు ఇంకా అవదు; ఎ. వి. ఎం. నుంచి గోవర్ధనం బయటికి వచ్చేసి, స్వంతంగా "కైరాసి" అనే విజయవంతమైన తమిళ చిత్రానికి సంగీతం ఇచ్చారు. సుదర్శనం తమిళంలో ఆ స్టూడియోనుంచి వచ్చిన అన్ని చిత్రాలకు (పైన చెప్పుకున్న వాటి తర్జుమాలేకాక) "మామియార్ మెచ్చియ మరుమగల్", "సహోదరి" చిత్రాలకు సంగీత దర్శకత్వం నిర్వహించారు. ఇప్పుడు అదే ఎ. వి. ఎం. పతాకంక్రింద తయారవుతున్న భానుమతి నటిస్తున్న తమిళచిత్రం "అన్నై" కి వీరే సంగీతం ఇస్తున్నారు. దీనికి అనిసెట్టి తెలుగు అనువాదం సంవత్సరాంతం ముందుగానే వస్తుంది.

"ఇద్దరు మిత్రులు" లో "పాడవేల రాధికా" పాట చివరన వినిపించిన గొంతు ఘంటసాలదే. లేదని మీ రెలా భ్రమపడ్డారు?

"బరస్ బరస్‌కర్ అఖియా తరస్‌గయీ" అన్న పాటకూ, రాజమండ్రికీ నా మనస్సులో ఒక సంబంధం ఉందని కొన్ని వారాలక్రిందట వ్రాశాను. దీనిని గురించి రాజమండ్రి—వెంకట్‌గారు వ్రాశారు. ఆ మాటలకు పూర్తిగా అర్థం తెలియలేదనీ, తెలియకపోయినా చదువుతుంటే ఏవో గిలిగింతలుగా అనిపించినదనీ, అర్థం ఎవరినైనా అడిగి తెలుసుకోవటానికి సిగ్గనిపించినదనీ, పైగా నా మనసున గల ఆ సంబంధానికి పూర్వాపరాలు తెలుపమనీ.

రెండు నెలల క్రిందట నేను రాజమండ్రిలో రెండు రోజులు ఉన్నాను. ఆ రెండు రోజులు అనుక్షణం ఒకరి రాకకోసం ఎదురుతెన్నులు చూశాను. ఏమీ తోచక హోటలు గదిలో తిరుగాడుతూ ఉండగా, రేడియోలో లత పాడిన ఆ పాట వినిపించినది. అంతకుముందే ఆ పాట నాకు తెలుసు. ఆ సన్నివేశానికి అంతగా తగిఉండటంచేత వెంటనే కొత్త పాటలా ఆ పాట మనస్సును చుట్టివేసింది. ఆ పాట సారాంశం "ఇన్ని విధాలుగా రమ్మని వేడుకున్నాను. ఇన్ని రోజులుగా నీకోసం వేదనతో వేచియున్నాను. కన్నులు నిరీక్షణతో నిర్జ్యోతులైనవి. ప్రియా! నీవు వచ్చేది ఎప్పుడు?" అని. చాలా హాయిగొలిపే పాట. ఆ నిరీక్షణని కలకాలం నా మదిలో నిలిపే పాట. ★




అనగా అనగా ....

"ఒక రామనాధంగారు, పార్వతమ్మగారు; ఇంకో సోమనాధంగారు, లక్ష్మమ్మగారు.

రామనాధం, పార్వతమ్మగార్లకో జాబిలి; సోమనాధం, లక్ష్మమ్మగార్లకో జాబిలీ—ప్రియరావు.

రామనాధం, పార్వతమ్మగార్లకింకెవరూ లేరు. సోమనాధం, లక్ష్మమ్మగార్లకింకో వాణి ఉంది.

రామనాధంగారు, సోమనాధంగారు ఒకే కోర్టులో ప్లీడర్లు.

పార్వతమ్మగారు, లక్ష్మమ్మగారు ఒకే గుడిలో పురాణ కాలక్షేపం.

రామనాధంగారికి బోలెడు డబ్బుంది; సోమనాధంగారి కింకా బోలెడు డబ్బుంది.

రామనాధంగారూ, సోమనాధంగారూ చాలా ఆప్తులు, స్నేహితులు, బంధువులు.

పార్వతమ్మగారు, లక్ష్మమ్మగారు—డిటో.

జాబిలి, వాణి డిటో—పెద్దయ్యాక.

కాకముందు, జాబిలి, జాబిలీ ప్రియరావు చాలా ఆప్తులుగా, స్నేహితులుగా, బంధువులుగా ఉండే వాళ్ళు.

అప్పుడు వాళ్ళ పేర్లు ముద్దుగా పాప, బాబు! నిజంగా జానకి, రామారావు.

జానకి, జాబిలిగా మారింది పదమూడోయేట, అక్టోబరు పధ్నాలుగో తారీఖున.

ఆరోజు కోయిలలు కూశాయి; కోటి మల్లెలు విరిశాయి. 'కిసలయాలు' చిగిర్చాయి; దేవతలు గులాబీలు కురిపించారు; నెమళ్ళు నాట్యం చేశాయి. వెన్నెల బాగా కురిసింది; లోకమంతా మెరుపు పూత పూసుకుంది....

రామారావు జాబిలీ— ప్రియరావుగా మారిందారోజునే.

ఆరోజు రెండో ప్రపంచయుద్ధం మొదటిరోజుకన్నా, భారతదేశం స్వతంత్రమైన నాటికన్నా, మహాత్ముడు నిర్యాణం పొందిన దినం నాటికన్నా, మేర్లిన్ మన్రో ఈలోకాన్ని వదిలిన నాటికన్నా —ఇంకా పెద్దప్రవిమ అక్షరాల్తో రామారావు మెదడ్లో చెక్కబడింది.

"ఒక కొత్త శకానికి నాంది", "ఒక నూతన యుగానికి పునాది", "చరిత్రలో నూతన అధ్యాయం", "జీవిత నాటకానికి

ప్రారంభం" ఇలాంటి ఎన్నో పడికట్టు మాటల్తో ఆ రోజునిచిరకాలం సంస్మరించుక ఉంటాడు రామారావు.

కారణం—

ఆరోజునుంచీ అతనితో మాట్లాడటం మానేసింది జానకి; కలిసి స్కూలుకి రావడం మానేసింది.

ఆరోజునుంచీ అతని ఎదట పడ్డానికి జంకుతున్నట్టు కనబడింది; కనబడినప్పుడు "తృతీయ పురుష" లో మాట్లాడేది; సూటిగా చూడ్డం మానేసింది. పుస్తకాలు దాచేయడం, పెన్ను, పెన్సిలు కనబడకుండా చెయ్యటం, బట్టలమీద సిరా విదపడం లాంటి అల్లరిపనులు మానేసింది—కనీసం పబ్లిగ్గా.

ఆనాటినుంచీ జానకికీ, వాణికీ స్నేహం, ఆత్మీయతగా మారి రెండు పువ్వులు మూడు కాయలు లాడిగింది.

అప్పుడు రామారావు స్కూలుఫైనలు; జానకి, వాణి రెండు క్లాసులు తక్కువ.

ఆ ట్టే ముందుండడం అంత మంచిదికాదని పించి, రామారావు పరీక్ష రెండుసార్లు ఎగిరి పోయింది.

దానికి కారణాలేవై యుంటాయా యని రామనాథంగారూ, సోమనాథంగారూ సెలక్టుకమిటీగా తమని తామే నియోగించుకొని మూడు నెల్ల విచారణ తర్వాత ఒక ఏకగ్రీవ నిర్ణయాని కొచ్చారు.

రామారావు దృష్టి ఇతరేతర 'కాలవ' ల్లో ప్రవహించడమే కారణం!

అయితే ఈ జబ్బు మూలం కనిపెట్టడంలో కుదిరిన ఏకాభిప్రాయం, దాని నిర్మూలనకి అనుసరించాల్సిన విధానంతో కుదరలేదు.

"అది కాస్త కానిచ్చేస్తే వదిలిపోతుంది" అన్నాడు రామనాథంగారు.

"వాడి మొహం! ఎసెల్సీ రెండేళ్లు చేసినవాడు ఇంక పైన ఎలా వెలగబెడ్తాడో! పాపం, విక్టోరియాలా చదువుకునే పిల్ల, వీడితో ముడెట్టి దాన్ని పాడుచెయ్యడ మెందుకు!" సోమనాథంగారు భిన్నాభిప్రాయం వెలిబుచ్చారు.

నాన్న—మాటలు విన్న రామారావు ఆ ఏడాది స్కూలు రికార్డులన్నీ ఫెడీల్మని విరగ్గొట్టి మరీ పాసయ్యాడు.

"హారి స్కౌండ్రల్! ఎంతటి వాడవురా!" అని ముక్కుమీద వేలేసుకున్నాడు సోమనాథంగారు కొడుకు ప్రజ్ఞ కాశ్చర్యపోయి.

రామనాథంగారు నాకు ముందే తెలుసు నన్నట్టు నవ్వాడు.

లడఖ్ లో చీనా — వాళ్లందర్నీ కత్తిపట్టుకు చీల్చి చెండాడి తుత్తునియలు చేసేసి చెక్కు చెదరకుండా తిరిగొచ్చిన సాటిలేని మేటి వీరుడన్నట్టు 'నా బాబే!' అని మురిసిపోయింది లక్ష్మమ్మగారు.

"మా అల్లు డెలాగైనా తండ్రిగార్ని, మామగార్ని మించిన లాయరవుతాడు!"—వాళ్లిద్దరి ప్రోక్షీనూ ఇతగాడికే రావొచ్చన్న ఆశాభావం వ్యక్తంచేసింది పార్వతమ్మగారు.

"ఒరేయ్, అన్నయ్యా! పాప ఏమంటోందో



చూశావా! నిలాగైతేం, మూడోసారి తలక్రిందులై పడి గట్టెక్కించావుట!" విరగబడి నవ్వుతూ వార్త మోసుకొచ్చింది వాణి.

రామారావు నీరసపడ్డాడు. కొన్నాళ్లుగా అతని కనుమానంగానే ఉంది—జానక్కి తనమీద ఉండాల్సిన అభిప్రాయ మున్నట్టు లేదు! కాబోయే ప్రత్యక్ష దైవమన్నమాటలా ఉంచి, అన భౌతి మంచబ్బాయన్న గౌరవమన్నా ఉందా!

ఇంతకాలం రామారావు కల లన్నిట్లోనూ జానకి జూలియట్, యెంకి, లైలా, పారూ లాంటి అవతారా లెత్తినప్పుడల్లా తను విధిగా రోమియో, నాయుడు బావ, మజ్ఞును, దేవదాసు వగైరా అవుతూనే ఉన్నాడు.

తనకి జానకి కనబడ్డట్టే, జానకి కలల్లో తను కనపడ్డంలేదా?

రామారావు మతిపోయింది. శోకం పికట్టేంది, ఒళ్లు ఝల్లుమంది!

ఇది కొంచెం బరువుగా ఆలోచించాల్సిన విషయం మనిపించి ఒక్కడూ ఊరు బయట అయిదు తూముల దగ్గరకి పోయి ఒక మోదుచెట్టు క్రింద చతికిలపడ్డాడు. సితార్ గాని, వీణ గాని దొరికితే తీగెలు తెంపి రసవృష్టి కాపాడదామని ప్రయత్నించాడు గాని అవేవీ దొరక్కపోవడంతో కుండనొకటి పగలకొట్టి సర్దుకుని ఆలోచించాడు.

గోదావరి మన్నుతిన్న పాములా అంతేవీ లేకుండా తాపీగా పారుతోంది. మేఘాలు అక్కడక్కడా తెల్లని ముద్దల్లా నీళ్లలో కనబడుతున్నాయి. పడవొకటి తెరచాపెత్తుకుని చుట్టూ మూగిన కొబ్బరిచెట్ల మధ్యనుంచి తెల్లటి దిగంతాల్లో కెక్కడికో పోతోంది — చుట్టూ సర్వేచేసిన రచయిత ఎవరన్నా ఇక్కడుంటే ఎలా రాసేవాడో స్మరించుకుని స్థిమితపడ్డాడు. సినీ—కెమెరా మనిషైతే ఇక్కడ హఠాత్తుగా మెరిచి తనమున్నపళంగా తెరెక్కిస్తే చూసేవాళ్లకి చూడగానే తన హృదయం భగ్నమైందని తట్టుందా, లేదా!

తట్టుతుందనే ఆత్మవిశ్వాసం కలగ్గానే రావు ఆలోచించాడు.

జానక్కి కలల్లో కనబడ్డం ఎలాగ?

రామారావు కూర్చున్న తర్వాత ప్రపంచం చాలా మారింది. మబ్బులు కరిగిపోయాయి. తెరచాపెత్తిన పడవ నలుపై మాయమైంది. దూరంగా మనుష్యుల మాటలు రాత్రి చీకట్లో దెయ్యాల అరుపుల్లా వినబడుతున్నాయి. గోదావరి బుల్లి బుల్లి అలలు పెద్ద కంకర రాళ్లని తోసుకుని చెప్పే రహస్యాలు, ఆకాశంలో ఏవో పిట్టలు చేసే శబ్దాలు చేప ఎగిరి కాస్త దూరంలో పడిన చప్పుడు తప్పించి వేరే అలికిడి లేదు.

రామారావు లేచాడు. అతనితో ఒక అంతు దొరికిన తార్కికుడి ఆనందం వెల్లివిరిసింది.

గబగబా ఇంటికొచ్చి ఆ రెండుమూడేళ్లుగా ప్రచురింపబడిన కథలన్నీ, తమాషాగా రాసినవి, తేలిగ్గా రాసినవి, బరువుగా రాసినవి అన్నీ క్షుణ్ణంగా చదివి వంటబట్టించుకున్నాడు.

(చదువరా! ఇకముందు కథంతా కొన్ని సంఘటనల సమాహారం. ఒక్కొక్క సంఘటనా మన నాయకుడి యాత్రలో ఒక్కొక్క మైలు రాయి.

## జాబిలి

ఇదంతా ఒకే గొలుసులా రాస్తే ఇదో నవలవుతుందేమో? ప్రస్తుతానికి కథతోనే సరిపెట్టి జరిగిన వాటినే తెలుసుకుందాం.

ఒక సాయంకాలం నీరెండలు మేడలకీ, రోడ్లకీ, మనుష్యులకీ రంగులు పూస్తున్నాయి. జానకీ, వాణి కాలేజినుంచి తిరిగొస్తున్నారు. వాళ్ల వెనకాలే పదడుగుల దూరంలో ఎస్కార్టు రామారావు. ఇంకా చాలామంది రోడ్డుమీద నడుస్తున్నారు—కాలేజి అబ్బాయిలు, చక్కర్లు కొట్టేవాళ్లు, చేపలమ్మేవాళ్లు, లాయర్లు, టీచర్లు, అమ్మాయిలు వగైరా.

ఇంతలో ఎక్కణ్ణుంచో సైకిలుమీద దూసుకొచ్చాడు దుగ్గడు. దుగ్గడి చరిత్ర కొంచెం చెప్పాలి. పదిమంది 'భళాభళీ'గాళ్లని చుట్టూ పోగేసుకుని కాఫీ హోటళ్లలో, రోడ్డు నాలుగు భాగాలూ కలిసేచోట, ఆఫీసు వర్థాండాల్లో సిగరెట్ తగిలించి, గట్టిగా నోటి కొచ్చింది నలుగురి గురించీ వాగడం తప్పించి వేరే పనిలేదు దుగ్గడికి. జిడ్డుకారే మడ్డిరకం మోటుఆకారం, సభ్యత తెలియని వాగుడు నలుగురికీ ప్రదర్శించి ఊళ్లో 'జాంబో' అని ఖ్యాతి తెచ్చుకున్నాడు దుగ్గడు.

"పూలెట్టుకోలేదేం ఇవాళ, చిలకా!" దుగ్గడు జానకి పక్కగా సైకి లాపి నేలమీద వయ్యారంగా కాలాన్చి అడిగాడు.

వెంటనే దుగ్గడ్ని వెనకనించి కాలరు పట్టుకు క్రిందకి గుంజి, రెండు బలంగా చెరో చెంపనీ తగలనిచ్చాడు రావు.

"ఏమిట్రా కూస్తున్నావు పబ్లిక్ ప్లేస్లో," అని చేతులు దులుపుకుని హీరోలా అడిగాడు రావు అయిదడుగుల ఆరంగుళాలు సాగి. జనం చుట్టూ మూగారు. అంత లావు దుగ్గడికీ కళ్లలో నీళ్లు తిరిగి, చుట్టూ జేరినవాళ్లంతా తలో చెయ్యీ అందుకునేలోపల సైకిలుపైన ఉడాయించాడు. జానకి, వాణి తలొంచుకుని చకచకా వెళ్లిపోయారు.

అంతా బాగానే అయింది గాని, ఆ రాత్రి రావు తన మొదటి ప్రయోగానికి ఫలిత మేమిటా అని గోళ్లు కొరుక్కునేంతలో, వాణి వచ్చి జేరేసింది చల్లగా, "ఏమిట్రా అన్నయ్యా, నువ్వు మరీ! ఆ పశువేదో వాగాడని నడిరోడ్డుమీద వాడితో సమానంగా! మరీ అంత ఇదిగా రోడ్డుమీద పడి ఏమిటా కొట్టుకోడమని పాప కూడా అసహ్యించుకొంది."

రామారావు ఇన్నాళ్లుగా తను చేసిన కసరత్తూ, ఇంత శ్రమపడి వాడికి లంచమిచ్చి లెంపకాయలు కొట్టిన శ్రమా—అంతా వేస్టయిపోయాయే అని బాధపడి తర్వాతి ప్రయోగానికి ముందడుగు వేశాడు.

కొన్నాళ్లకి.

యూనివర్సిటీ పరీక్షలకి మూడు నెల్ల ముందునుంచీ నిద్ర, తిండి మానేసి ఇరవైనాలు గ్గంటలూ పుస్తకాల కంటుకుపోయి, అడ్డమైన నోట్సులు, గైడ్లు బట్టీపట్టి పరీక్షల్లో గుద్ది

లాస్తే, రావు ప్రయత్నం అనుకున్నదానికన్నా ఎక్కువే ఫలించింది. బుద్ధిగా చదువుకొని పరీక్షల్లో మంచి మార్కులు తెచ్చుకునే అబ్బాయి అంటే అమ్మాయిలకి మోజుగా ఉంటుందని ఎక్కడో చదివాడు. అది నిజమయితే ఈపాటికి తను జానకి హృదయంలో కనీసం సగభాగం ఆక్రమించి ఉండాలి. కాలేజి మొత్తానికి మొదటివాడు కావటం అంటే మాటలా మరి!

ఆ మధ్యాహ్నం జానకి మార్కులు, సి. సి., టి.సి. వగైరాలు తెచ్చుకోడానికి కాలేజికి వెళ్ళిందని తెలిసి, తనూ బయల్దేరాడు రావు. తిరిగి వచ్చేస్తూ గేట్లోనే కనబడింది జానకి. రామారావు కాలరు పైకెత్తి విజయగర్వంతో చూశాడు.

జానకి నవ్వింది.

రావు మేజర్ నికొలయావ్ లాగ సాగి, నిలబడ్డాడు.

జానకి నడక వేగం తగ్గించి కళ్ళు దించుకుని, నవ్వు నాపుకుంటున్నట్టు పళ్ళతో పెదిమల్ని అదిమింది. బుగ్గలు ఎర్రగా ఐపోయాయి. కళ్ళకి పెట్టిన కాటుక కొంచెం పక్కకి పాకి ఇతనివంక చూస్తోన్నట్టుంది.

రామారావు మెద డింక పని చేయనని మారాం చేసింది. శరీరం ఆగింది.

"పకోడీ!" గబగబా వెళ్ళిపోయింది జానకి నవ్వు నాపుకుంటూ.

మూర్ఛ వచ్చినంత పనయింది రావుకి. తనింత కష్టపడిందీ, ఈ మాటపడ్డానికా!?!

ఆ షాక్ నుంచి తేరుకొని మరో పద్ధతి నవలంబించడానికి చాలాకాలం పట్టింది రావుకి.

ఈలోపల—

రావు అనుకున్నట్టు 'లా' లోపల చేరాడు. జానకి మెడికో అయింది. వాణి ఆనర్సులో జేరింది.

యూనివర్సిటీ టెన్నిస్ క్లబ్‌లో జేరి ఆ ఆటలో ప్రావీణ్యం రెట్టింపు చేసుకున్నాడు రావు. ఇంతకు ముందు పిల్లకాలేజీలో ఆడేప్పుడు అంత శ్రద్ధ ఉండేదికాదు. ఇప్పుడు పట్టుదల ఎక్కువై అద్దంతో చాలా నేర్పు సంపాదించాడు. యూనివర్సిటీ గుర్తున్న నీలంరంగు కోటు బటన్సు తీసేసి తొడుక్కుని, మెడదాకా కప్పే తెల్ల బనీను, నిక్కరు, సాక్సు, బూట్స్, ఎర్రని శరీరం, నొక్కుల జుట్టు—పాంఛోగోంజాలిస్ బాబులాంటి తన వాటం చూసి జానకి గుండె గుబగుబా గొంతుకలో కొట్లాడుతుందని రావు ఊహాగానం. తను ఆడబోయే ప్రతీ మాచ్‌కీ జానకి నాహ్వానించేవాడు. ఆమె వీలైనప్పుడు వచ్చేది; లేనప్పుడు లేదు.

ఆ ఏడాదంతా అంతర్ కళాశాలా పోటీలని, 'అంతర్‌విశ్వవిద్యాలయ పోటీలనీ ఊళ్ళన్నీ తిరిగాడు. పత్రికలు రామారావు ప్రతిభని పొగిడాయి, నెగ్గినప్పుడల్లా. కొన్నిట్లో ఫోటో కూడా ప్రచురించ జేశాడు. అన్ని పత్రికల్లోనూ తన గురించి ఉన్న మేర కత్తిరించి పోగుచేసి ఆ వ్యాఖ్యానాలు, ఫోటోలు అన్నీ జానక్కి చూపించాడు.

అంతా బాగుం దనుకుండే సమయంలో—

హాజరు సరిపోలేదనే వంకతో ఆ ఏటికి పరీక్షకి కూర్చోనియ్యలేదు ప్రొఫెసరు. ఇంకా ఏడాది కింటిదగ్గరే! పనీ పాటూ లేకుండా ఈ ఊళ్ళో ఉండనిస్తాడా నాన్న! రావు ఆశలన్నీ అడుగంటబోతూంటే, దైవంలా కాపాడింది జానకి. జానకి మాట కింటిదగ్గర తిరుగులేదు. ప్రొఫెసరు తన నిక్కడే ఉండి కాలేజికి వస్తూండమన్నాడని బొంకి జానకిచేత సాక్ష్యం పలికించాడు రావు.

"ఇంకనైనా జాగ్రత్తగా ఉండడం మంచిది!" జానకి పెద్ద ఆరిందాలాగా సలహా ఒకటి ఒంటరిగా ఉన్నప్పుడు కాగితంమీద రాసి చూపెట్టింది. చాలా బాధపడింది రావు మనసు.

దాంతో వదిలిపోతే బాగుణ్ణు. కాని—

ఆ ఏడాది ఇంగ్లీషు ఆనర్సులో జేరాడు, ఊరికే కూచోడం ఇష్టంలేక. సెప్టెంబర్లో, లా మొదటి సంవత్సరం పూర్తికాగానే మళ్ళీ ఆటలు మొదలు.

"ఇదిగో, జానీ! రేపు లాంబ్రెట్టా క్లబ్‌లో టెన్నిస్ పోటీలు! సింగిల్సు నెగ్గడం ఖాయం. తప్పకుండా వస్తావు కదూ! కాఫీక్సు దగ్గర పిక్ చేస్తాం!"

"సిగ్గు లేకపోతే సరి! క్రింద ఏడాది తిరిగిందంతా చాలదూ! మళ్ళీ ఈ ఏడాది పరీక్ష గుడ్డెట్టించుకోవా లేమిటి?" జానకి ఫోన్ పెట్టేసింది.

రూం కెళ్ళగానే, రాకెట్ తీసి విరగ్గొట్టాడు రావు. ఇం కీ జన్మలో టెన్నిస్ ఆడకూడదని ఆ క్షణంలోనే తీర్మానించాడు.

అయితే సమస్య అలాగే ఉండిపోయింది.

ఆధునిక సినీ నాయకుడిలాగా, బుద్ధిమంతుడైన మంచబ్బాయిగా, గొప్ప ఆటగాడుగా పేరు తెచ్చుకుని సాధించదల్చుకున్న దేదీ సాధించగల్గినట్టు తోచడంలేదు. తన గమ్యం ఇదివరకటంత దూరంగానూ నిలిచిపోయింది!

ఒక్కరోజైనా, కూడా సినిమాకి రమ్మని అడగలేదు జానకి. ఏడాది చివ రొక్కసారి హాస్టలు డిన్నర్‌కి రమ్మని పిలిచిందంతే. ఒకరోజు తను బీచిలో కూచుందాం రమ్మంటే, ఏవో వొరల్సు, ప్రాక్టికల్సు ఉన్నాయని తప్పించుకొంది. వాణితో కలిసి తిరిగేది, కాని తను నిద్దర్శి దగ్గరకి తీసుకురావాలని వాణి చేసిన ప్రయత్నాల్లో అంతగా సహాకరించలేదు.

"ఎందుకే పాపా! అన్నయ్య కంత పెద్ద శిక్ష, పాపం! రోజురోజుకీ మరీ పిచ్చాడై పోతున్నాడు. అసలు వాడి ఆకారం చూశావా, నువ్వీమధ్య!"

"మొన్న సెలెక్ట్‌లో చూశాను. ఆ గెడ్డం, సిల్కు లాల్చీ, పంచ, పైకి దువ్విన జుట్టు, చేతులో వయ్యారంగా చిన్న బైండు పుస్తకం! కునేగా మరి క్కాళందు కూడా పట్టించినట్టుంది!" నవ్వింది జానకి.

"స్వెటుస్లావ్‌రోరిచ్‌లా కనబడాలని ప్రయత్నం!"

"వెయ్యనీ, ఇంకా ఎన్ని వేషా లేస్తారో! ఇవన్నీ చూసి నేను చుట్టూ తిరుగుతాననీ! నాకు తెలుసులే అంతా. కానియ్యి, ఎన్నాళ్ళికి సాధిస్తారో, ఎలా సాధిస్తారో చూదాం."

"మొన్న మా క్లాస్‌మేట్ సరళతో ఈ గొడవ చెబితే, 'బ్రూస్ రావ్' అని పేరెట్టింది!"

"కాని బ్రూన్ సాధించాట్ట! మరి మీ అన్నయ్యా సంగతే మవుతుందో!"

రావు బొమ్మలు గీసి కొన్ని మాగజిన్లలోనూ, అక్కడా ప్రదర్శించాడు. ఆ బొమ్మల్ని చూసి జానకి మూర్ఛపోలేదు సరిగదా, "ఇవేం బొమ్మలు బాబూ! అసలు ఆకారాలే లేకుండా! ఈ మురికి రంగులూ ఇవీ!" వేళాకోళం చేసింది ......

ఆ తర్వాతి ప్రయత్నం గురించి—

"మీ అన్నయ్య రోజురోజుకీ వట్టి కాపీమాస్టరయిపోతున్నారు. మొన్నో కథ రాశారు చూడు, ఆంబ్రోబియర్స్‌కి కాపీ. మళ్లీ ఇప్పుడిది విలియం మార్చ్‌కి కాపీ!" చప్పరించేసింది జానకి.

రావుకింకా పట్టుదల పోలేదు. ఈసారి ఉపన్యాసాల్లోకి దిగాడు. సాయంకాలాలు చర్చిల్లా బీచిలో కూర్చొని గట్టిగా కెరటాల నుద్దేశించి అరిచాడు. చివరికి నెమ్మది నెమ్మదిగా వేదికల మీద కెక్కడం అలవాటు చేసుకుని, ఏవో ఒకటి రెండు బహుమతులు, రెండు మూడు అంతర్ కళాశాలా పోటీల్లో పాల్గోడం వగైరా కానిచ్చాడు. ఆ రోజుల్లోనే ఒకదానికి జానకి రావడం తటస్థించింది.

అప్పటికి వాణి ఆనర్సు పూర్తిచేసి ఇంటికెళ్లిపోయింది. జానకి ఫోర్త్‌యరు. రావు ఆనర్సు ఫైనల్లో ఉన్నాడు.

ఆ సాయంకాలం మీటింగయ్యాక జానకిని వాళ్ల బస్‌లో వెళ్లిపోనియ్యకుండా ఆపాడు రావు. ఇద్దరూ బీచిలోకి దిగి, ఇసకమీద నీరు చేసిన అద్దపు పొరలో ప్రతిఫలాల్ని చూసుకొంటూ పక్క పక్కగా నడక సాగించారు.

"ఈ షివ్రిలీ ఎప్పట్నుంచో!" జానకి ఎదురుగా కొండకేసి చూస్తూ అడిగింది తనలో తానే అనుకొంటున్నట్టు.

"వేళాకోళానికేంలే గాని, ఎలా ఉంది పాపా, నా స్పీచ్!"

"పెద్ద సినారేకు డబ్బాలో సగానికి గులక రాళ్లు పోసి గలగలలాడించినట్టుంది."

"అంటే?"

"అంటే, కవి హృదయ మేమిటో ఎవరికీ అంతుబట్టలేదు; ఏవో శబ్దాలు వినిపించా యంతే. అంత తొందర తొందరగా ఎవరో తరుముకొస్తున్నట్టు మాట్లాడేస్తే ఎవరి కర్థమవుతుంది?... పైగా, మాట్లాడుతున్నంతసేపూ నావంక చూడ్డమెందుకు? తల దించుకోలేక చచ్చాను. చుట్టు పక్కల మావాళ్లంతా ఒకటే నవ్వడం! ఎందుకొచ్చాన్రా అనిపించింది." జానకి నవ్వు నాపుకొంది.

రావుకింక ఆశ పోయింది. "వ్హాట్ ఎ టఫ్‌నట్! అని ఇంగ్లీషులోనూ, "ఏం గట్టిపిండం!" అని తెలుగులోనూ నిట్టూర్చి రూం దారి పట్టాడు ఆవాళ్టికి.

పాంబీచ్ ఇసక గుట్టలమధ్య కూలబడి, తెల్లటి నురుగు కిరీటాల్ని తగిలించుకొని ఎగిరిపడే సముద్ర కెరటాలు, నల్లని రాళ్లు, దూరంగా కొండమీద కాంతి—కిరణాలు, అన్నీ చూస్తూ వేదాంతంలో పడిపోయాడు రామారావు. మానవ యత్నాలవల్ల ప్రయోజనం లేదు. అంతా దైవం ఎలా నిర్ణయిస్తే అలాగ. రాతెలా ఉంటే అలా జరుగుతుంది. కర్మ పరిపక్వమయితేనే గాని ఏదీ ఫలించదు. అసలు మనుషులంటే ఈ భూమనే వేదికమీద ఆడే తోలుబొమ్మలు. వీటిని నడిపించే తాళ్లు పైనెవరో పట్టుకున్నారు. జీవితాలు క్షణభంగురాలు. ఇదొక గారడీ, ఆట. ఈ బొమ్మలన్నిట్నీ ఇలా పేర్చి ఆడుకునే పసిపాప, వీటి నన్నిట్నీ కాసేపిక్కడా కాసేపక్కడా ఉంచి సంతోషిస్తాడు. అంతా మాయ. ఏదీలేదు. జానకీ లేదు. రామారావూ లేడు. ఉత్తి భ్రమ—రామారావు తర్కంలో చాలాదూరం పోయి విరాగిలా నవ్వాడు.

యూనివర్సిటీలో జేరి అప్పుడే నాలుగున్నరేళ్లు కావస్తోంది. యూనివర్సిటీ చాలా పెరిగింది, ప్రపంచం చాలా పెరిగింది. జానకి అందం పెరిగింది; చదువు ముగింపు కొచ్చింది.

---

ఒక యువతి నష్టపరిహారం కోరుతూ ఒక ఆస్పత్రిమీద దావా వేసింది. అందులో ఆమె ఇలా పేర్కొంది. "విరిగిన చేతికి ఎక్సరే తీస్తున్నప్పుడు లేబరేటరీ బల్లమీదనుంచి కింద పడ్డాను, దీనమూలంగా నా కాలు విరిగిపోయింది."

నారయ్య (బెల్లంకొండ)

---

తను! తనింకా తన గమ్యంవైపు ప్రయాణంలో ఇదివరకటి చోటే ఉన్నాడు! ఇదొక కూడలి. ఇక్కడ్నుంచి ఎన్నో చోటలకి దారులు. తనేదారిలో వెళ్లాలో తెలియదు. ఇదేమో అనుకొని, ఒకదారి వెంబడి పోయి అది కాదని తెలుసుకొని వెనక్కితిరిగి రావడమే అవుతోం దింతవరకూ! ఇం కిక్కడే కూర్చొని పోయి, అంతా పెద్దవాళ్ల కొదిలేయడం మంచిదేమో!

ఒకనాటిరాత్రి రెండు గంటలవేళ.

మేడపై పిట్టగోడమీద ఒక్కడూ కూర్చొని అలా సముద్రంవంక చూస్తున్నాడు. పైన చంద్రుడి కిరణాలు పడినంత మేర మైదానంలా మెరుస్తోంది సముద్రం. దూరంగా హార్బరు. ఎర్రగా జోగుతున్నట్టున్న కాలేజి లైట్లు. ఎక్కడో మైళ్ల కవతల లారీలు, బస్సులు తిరిగిన చప్పుడు. పెద్ద గాలి, విపరీతంగా చప్పుడు చేస్తో. రావు ఆలోచనలు గొలుసుకట్టుకొని చాలా దూరం సాగిపోయాయి; ఆ క్షణంలో—ఠటాలున ఒక ఆలోచన మెరిసింది.

రామారావు కథలు రాయడం మొదలెట్టాక జానకి చాలా కథలు రాసింది. అతను మధ్యలో ఇతర వ్యాపృత్తుల్లోకి దిగి మానుకొన్నాడు. ఆమె అదే పుంతలో పడి చాలాదూరం పోయింది. పైగా పత్రికలు అతనికన్నా ఆమెకే ఎక్కువ పబ్లిసిటీ ఇచ్చాయి. ఈమధ్య ఏదో పత్రికలో బహుమతి కూడా సంపాదించినట్టు గుర్తు ....

"హలో, జానకీదేవిగారూ!" రావు ఫోన్ చేశాడు మొగం కడుక్కున్న వెంటనే.

"ఎవరది?"

"రామారావు."

".... ఉహూ! ఇందులోకి దిగారన్నమాట చివరికి! .... ఈసారి నాటకాల్లో వేషం వేస్తున్నారా! ఇంకదొక్కటే తరువాయి! .... ఏమిటూ కొత్త పిలుపు!" జానకి వెడామడా దంచేసింది.

"ఆ గొడవింక మర్చిపొండి. నేను ఓడిపోయానని ఒప్పుకుంటాను .... తమ కో ప్రార్థన!"

"ఏమిటూ వేళాకోళం ప్రొద్దున్నే! మామూలుగా మాట్లాడుదురూ!"

"ఇప్పుడు మాట్లాడుతూంది బాబు, పావతో గాదు. విశ్వకళా పరిషత్ లలితకళా విభాగం కార్యదర్శి రామారావు, మహా రచయిత్రి జానకీదేవి గారితో కాబట్టి ఇలాగే మాట్లాడాలి."

"ఏడిసినట్టుంది!"

"ఏడిచినా, నవ్వినా, తమరు దయయుంచి రేపు మా సంఘ వార్షికోత్సవంలో మాట్లాడాలి. మహిళాభ్యుదయాని కేర్పాటయించిన రోజున ఒక వక్తగా మీ పేరు చేర్చాం. దయచేసి మీ రంగీకరించాలి."

"ఏమిటో అయోమయంగా ఉంది మీరు చెప్పేదంతా. ఒక్కసారిక్కడికి వచ్చి స్పష్టంగా చెబుదురూ బాబూ, పుణ్య ముంటుంది." మెత్తబడింది జానకి.

* * *

"మీ అన్నయ్యెంత మంచివారే, వాణీ!" ఓ సాయంకాలం మత్తుగా గునిసింది జానకి.

"ఇంతేనా, బడాయంతా! వాణ్ణేదో సాధిస్తానన్నావు మరీ!"

"సాధించలేదేమిటి! ఓడిపోయానని ఖచ్చితంగా ఒప్పుకొన్నారు తెలుసా! కావాలంటే అడుగు!"

"ఓసి, వెర్రి పాపా! ఓడిపోయినట్టు నటించి గెలిచాడే అన్నయ్య! నీకు తెలియకుండా బలే కుచ్చుటోపీ తొడిగాడ్లే! .... అవును గాని నీకింత తెలివితేట లెప్పు డబ్బాయిరా అన్నయ్యా!" దూరంగా పోతున్న రావుని పిలిచింది వాణి.

"కూచోబెట్టి నిండా తైరు పోస్తే బోర్లాపడని మని షింతవరకూ పుట్టలే దంటూండేవాడులే, మా స్నేహితుడు, జంబులింగమని! మహా మహా వాళ్లే నిలవలేకపోతే యాఫ్టరాల్ ఈవిడో లెఖ్ఖా!"

జాబిలినీ, జాబిలీ ప్రియుణ్ణీ ఎవరు నెగ్గారో ఎవరు ఓడారో తేల్చుకోమని వెళ్లిపోయింది వాణి.



# విశాలనేత్రాలు

26 వ పేజీ తిరుగాయి

ఏమిటి ?' అన్నది. అంతేకాని వివాహం కోసం అంతగా ఉబలాట పడలేదు. ఆపైన రంగనాయకుడు కూడా అంతగా బలవంత పెట్టలేదు. 'సరే, ఇంతలో మునిగిపోయిం దేమిటి ? మాఘ ఫాల్గుణ మాసాలలో ఎప్పుడో ఒకప్పుడు ఏర్పాటు చేసుకో వచ్చును.' అని సమాధాన పడ్డాడు.

రంగనాధస్వామి కొలువులో సేవ మాట కూడా అలాగే మరికొంతకాలం దాకా జరిగింది. అయిదారు సార్లు కాళ్లకు బలపాలు కట్టుకొని తిరిగిన తరవాత దేవాలయ ధర్మకర్త మల్లవిద్యలో సాము గరిడీలలో అతనిని కూలంకషంగా పరీక్షించి ప్రస్తుతానికి స్వామి సేవ కవకాశాలేవి లేవన్నాడు. కాని అక్కర కలిగినప్పుడు తప్పక కబురు పంపించగలనని భరవసా యిచ్చాడు.

రంగనాయకునికి ఆపైన మరి ఏమి చెయ్యడానికి పాలుపోలేదు. అత డిన్నాళ్ల నుండి శ్రీరంగంలో కొంచెం చాటుమాటుగానే సంచరిస్తున్నాడు. శ్రీరంగానికి, నిచుళాపురానికి మధ్యన పది పన్నెండు క్రోసుల కంటె ఎక్కువ దూరం లేదు. అయితే శ్రీరంగం పాండ్య రాజ్యంలో చేరిన పుణ్యక్షేత్రం. నిచుళాపురం కాంచీపురాధిపతులు పరిపాలిస్తున్నారు ఆ రెండు రాజ్యాలకు కావేరీనది ఒక సహజమయిన సరిహద్దు. కనకనే రంగనాయకుడు శ్రీరంగంలో స్థిరవసతి ఏర్పాటు చేసుకొన్నాడు. అందుచేత ఎంతగా ప్రయత్నించినా రెడ్డి తన విషయమే తలపెట్టలేడని ఎంతో సంతృప్తిపడ్డాడు. కాని, అతగాడొకవేళ శ్రీరంగంలో తన ఉనికి కనిపెట్టిన పక్షంలో ఏదోవిధంగా గట్టి ప్రతీకారం తలపెట్టవచ్చును! కనకనే ఇరుగు పొరుగుల కెవరికీ తన యధార్థ విషయా లేవి తెలియకుండా మిక్కిలి మెళకువతో వ్యవహరించాడు. స్వామి ముడుపు చెల్లించడానికి కూడా అనుకున్నంత దగ్గరగా మంచి శుభ ముహూర్త మేది కుదరలేదు. సరే మరికొంతకాలం గడిచిన తరవాత ఆ సంగతి ఆలోచించుకోవచ్చునని అనుకొన్నాడు.

అయితే పొద్దస్తమానము ఇంటిదగ్గిరపడి ఉండడానికి అతడు అలవాటుపడి ఉండలేదు! అయినా ఒకటి, రెండు మాసాలపాటు అలాగే ఓరిమి వహించి ఎంతో గుట్టుగా కాలక్షేపం చేశాడు. ఆపైన మరి భయం లేదని నిశ్చయించి శ్రీ రంగేశుని ఉత్సవాలలో ఊరేగింపులలో బాహాటంగా పాల్గొన్నాడు. క్రమ క్రమంగా ఉబుసుపోకకోసం ఉత్సవాలలో మల్లవిద్యా చాకచక్యంతో ప్రజానీకం ప్రశంసలందుకొంటున్న కొంతమంది జెట్టీలతో పరిచయం కల్గించుకొన్నాడు. ఆనాటి కానాటి కాపరిచయం క్రమక్రమంగా కొంచెం స్నేహంగా పరిణమించింది. అప్పటినించి రంగనాయకునికి మనస్సులో ఆ నగరంలో కాలక్షేపం కావడం కష్టమన్న ఆలోచన పూర్తిగా తొలిగిపోయింది. మిత్రులతో కలిసి అతడు తిరిగి మల్ల క్రీడా వ్యాసంగము, ధనుర్విద్యాగోష్ఠి ప్రారంభించాడు.

రంగనాయకుని స్నేహితుల ధోరణు లనేకవిధాలు. వారిలో కొందరికి మల్లవిద్యమిదకాని, ప్రపంచంలో మరి దేనిమీద దృష్టిలేదు. వారి అత్యాసక్తి అంతటిది! మరికొందరు కుటుంబ పోషణకోసమే ఆవిద్య అభ్యసించారు. ఏదోవిధంగా జీవితం కొనసాగించుకోవడమే వారి ప్రధాన లక్ష్యం. రంగనాయకునికి కొంచెం సన్నిహిత మిత్రు డొకడు బంగారు పిచ్చుక. అతనిపేరు శ్రీశైలం. మనిషి కొంచెం మంచివాడే. కాని, చిన్నతనంనించి కొన్ని దుర్వ్యసనా లలవడ్డాయి. వాటిలో మొదటిది వార-కాంతాగోష్ఠి. రెండవది మద్యపానాభిరుచి. శ్రీశైలం వట్టి ఉబుసుపోకకోసమే సాము గరిడీ లభ్యసించాడు. అందుచేత ఆ విద్యలో అతనికి అంతంతగామాత్రమే ప్రవేశం కలిగింది. అయితే 'అందెవేసిన చెయ్యి' అన్న గొప్ప ప్రతిష్ఠ గడించుకోవాలన్న గట్టి పట్టుదల కలిగింది. వారిద్దరి మైత్రి అభివృద్ధి పొందడానికి అదీ ఒక ప్రధాన కారణమే.

ఆ కొత్త చెలిమివల్ల శ్రీ శైలానికి మల్లవిద్యలో అంతగా పాటవం లభించలేదు. కాని రంగనాయకునికిమాత్రం క్రమక్రమంగా మద్యసేవ, నెరజాణలయిన వారాంగనల నృత్యాభినయాలపై అనురక్తి అలవడ్డాయి. శ్రీ రంగంలో కాంతామణి లాస్యంలో, నృత్యంలో మీను మిగిలిన నర్తకి. శ్రీశైలంతో కలిసి రంగనాయుడు నాలుగయిదుమార్లు ఆ సుందరి అభినయ చాతురి లోతు లవగాహన చేసుకొన్నాడు. అంతేకాదు. ఒకనాటి రాత్రివేళ నృత్య సమయంలో పైడిమువ్వలు పొదిగిన అందెల జత కూడా బహూకరించాడు. ఇరుగు పొరుగులద్వారా ఆ వార్త హేమసుందరి చెవిని పడింది. అయినా ఆమె వినీ విననట్టు మాట్లాడకూరుకొన్నది. అంతేగాని, ఇదేమని నిలవరించలేదు.

ఆపైన అర్ధరాత్రిదాటినదాకా ఒక్కనాడు అత డింటికి చేరుకోలేదు! ఆనాటి కానాటికి హేమసుందరి ఓరిమి క్షీణించింది. మరి సహించలేక ఒకనాటిరాత్రి అణగించి వేసుకున్న అక్కసుతో డగ్గుత్తికతో నిలవరించింది:

'రోజు రోజు అపరాత్రివేళదాకా ఆధర్మకర్త భవంతిముందు పడిగాపులుపడి కూర్చోవడంతో, మీ కాళ్లరిగిపోతున్నాయిలాఉంది! ఇక ఇంతటితో ఈ ప్రయత్నం కట్టిపెట్టి మరోపని ఏదయినా చూచుకోరాదా ?'

ఆ ప్రశ్న అతని హృదయంలో అప్పుడే పదును పెట్టిన బల్లెం మొనలా పొడుచుకుంది! విసుగుదలతో మేళవించిన చిరాకుతో పెడముఖం పెట్టుకుని కూర్చున్నాడు :

'నే నీ మధ్యన అధర్మకర్త భయంతిపైపే వెళ్ళ లేదు.'

'మరి రోజు రోజు అపరాత్రివేళదాకా ఏమి చేస్తున్నట్టు ?'

''ఏదో ఉబుసుపోక అప్పుడప్పుడు కాంతామణి భామ కలాపానికి వెడుతున్నాను! అంతే! ఏం వెడితే తప్పా!?

'తప్పని ఎవరన్నారు ! దగ్గిర, దాచిపెట్టుకొన్న నగలు, నాణ్యాలు అయిపోయిన తరవాత, మనం ఇద్దరం చిప్పచేతో పుచ్చుకుని శ్రీరంగంవీధుల్లో అడుక్కుని తినాలేమో అని భయపడుతున్నాను! అంతే!'

# నాగార్జున సాగరం

వి. వి. సుబ్బారావు

నాగార్జున సాగరం
నవ్యకళా దీపకం
నవభారత నిర్మాణపు
శ్రమజీవన సాధకం ||నా||

అంబర చుంబిత నిర్మిత
అమరలోక సౌందర్యం
ఆంధ్రజాతి అభ్యున్నతి
పొందుపరచు శిలాఖండం ||నా||

సుర-నదీ ప్రవాహా వేగ
నిర్జిత ఘనపర్జన్యం
నిద్రాణపు జాతి నుద్ధ
రించు మహా ప్రాకారం ||నా||

మానవ మేధల పరిధిని
భేదించే కొలమానం
నిపుణ భారతావనికే
గర్వకారణ గాంభీర్యం ||నా||

నాగార్జున శిల శాలా
పరివేష్టిత కాసారం
కర్షకజన కల్పతరులు,
కాల్వలు బహుధా ప్రాజ్యం ||నా||

అవనత శిర, శ్రమజీవన
కార్మికజన సందోహం
కష్టించి, సమష్టి చేత
సృష్టించెడి సౌభాగ్యం ||నా||



## ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రకటనలు
## మీ వ్యాపారాభివృద్ధికి తోడ్పడుతాయి

# విశాల నేత్రాలు

దానితో రంగనాయకుడు కస్సుమన్నాడు:

‘ఆ యాతన పడవలసినవాణ్ణి నే వొక్కణ్ణేగాని మధ్యన నీకేం?’

ఆ ఎత్తిపొడుపుతో హేమసుందరి ముఖం కెంపుల రాశిలా ఎఱ్ఱబడింది. చెక్కిళ్ళపై కన్నీరు దిగజారింది. మరి భరించలేక చీర చెరగుతో ముఖం కప్పుకుని వెక్కి వెక్కి ఏడ్చింది. అప్పటికిగాని రంగనాయకునికి తానన్నమాట కున్న పదునెంతటిదో బోధపడలేదు. క్షణంలో తన తప్పిదం గ్రహించుకొని నాలిక కరుచుకుని మన్నించవలసిన దని కాళ్ళావేళ్ళాపడి బ్రతిమాలుకొన్నాడు. హేమసుందరి ఆ ప్రార్థన వినీ విననట్టు మాట్లాడ కూరుకొన్నది. ఇంచుమించుగా ఒక అరగడియసేపు ప్రాధేయపడిన పిమ్మట ఆమె మనోవేదన రవంత ఉపశమించింది. ముఖంలో కొంచెం ప్రసన్నత గోచరించింది. ఆనాటి నించి రంగనాయకు డెప్పుడు ఇంటికి చేరుకోవడానికంతగా ఆలస్యం చెయ్యలేదు. కాని, కాంతామణి నృత్యోత్సవాలమీద అతని అభినివేశ మేమాత్రము సడలలేదు. అవి తటస్థపడినప్పుడు మాత్రం అనుకున్న దానికంటె ఎక్కువ ఆలస్యంకాక తప్పలేదు! క్రమక్రమంగా హేమసుందరి నది ఒక పీడని మనశ్శల్యంలా పట్టుకుని వేధించింది. అయినా ఆమె అతని నెన్నడు పల్లెత్తు మాటయినా అనలేదు.

అలాగ మరికొన్నిరోజులు గడిచిన తరవాత రంగనాయకుడు ఒకనాటి సాయంకాలం కాలక్షేపంకాక రంగనాథ దేవాలయానికిపోయి స్వామిని సందర్శించి తీర్థ ప్రసాదాలు తీసుకొని, పుష్కరిణిఒడ్డున కూర్చున్నాడు. ఆ సమయంలో అతనికి తన మొక్కుబడి సంగతి జ్ఞాపకం వచ్చింది. ‘శ్రీరంగం చేరుకోగానే మొక్కు చెల్లించుకోవాలని అనుకున్నాను. కాని, ఎన్నాళ్ళకీ మంచిరోజే కుదరలేదు! స్వామికి నామీద దయ తప్పిందేమో! ఇంకొకసారివెళ్ళి శుభముహూర్తం సంగతి అడగాలి. ఏదో ఒక మోస్తరు ముహూర్తమయినాసరే, కుదర్చమని తొందర చెయ్యాలి!’ అని చిన్న నిట్టూర్పు విడిచిపెట్టాడు. అంతలోనే తలవని తలంపుగా అతని కల్లంతదూరంలో గోపాలయ్య కనిపించాడు. రంగనాయకుడు తనకన్నులే నమ్మలేక కనబడిన వ్యక్తి గోపాలయ్య అవునో కాదో అని క్షణంకాలం తటపటాయించాడు.

‘నిజమే! గోపాలయ్యే!’ అనుకొని సమీపించి అతనిని గాఢాలింగనంతో బంధించాడు. కుశల ప్రశ్నాదికం జరిగిన తరవాత గోపాలయ్య నిచుళాపురం విశేషాలొక లొకటే తన నెచ్చెలి కెరిగించాడు. మొత్తంమీద మిత్రునిముఖతః కొన్ని విని, ఆపైన రంగనాయకు డూహించి గ్రహించిన వృత్తాంతాలివి.

హేమసుందరితో కలిసి, రంగనాయకు డెక్కడికో వెళ్ళిపోయాడన్న దారుణవార్త చెవినిపడగానే వెంకటనాయకుడు ఒక్కసారిగా గుగ్గిలం చల్లిన అగ్గిలా భగ్గుమని మండిపడ్డాడు. ఆపైన మరి తన దగ్గిర కుమారుని ప్రస్తావనే ఎత్తనీయలేదు! అంతటితో తన శని పీడ విరగడయిపోయిందని మాట్లాడ కూరుకొన్నాడు. అతనిమాట కెదురాడలేక అన్నలిద్దరు కొన్నిరోజులపాటు లోలోపలే మథనపడ్డారు. కాని, క్రమక్రమంగా పొలాల పనుల గొడవలలో పడి ఆ మాటే తలపెట్టడం మానుకొన్నారు.

తల్లిమాత్రం కొడు కెక్కడికి వెళ్ళిపోయాడో ఏమయిపోయాడో అని పరిపరివిధాల ఆరాటపడింది. వెతికించి తిరిగి ఇంటికి తీసుకురావలిసిందని మాటిమాటికి భర్త చెవిలో ఇల్లుకట్టుకుని పోరింది. కాని, రవంతయినా ప్రయోజనం కలగలేదు! పైగా ఆ మాట తలపెట్టగానే వెంకటనాయకుడు తొక్క తొక్కిన కోడెత్రాచులా కస్సుమన్నాడు. మరి గత్యంతరంలేక లక్ష్మిదేవమ్మ గుడ్లనీరు కుక్కుకుని తన పూర్వజన్మ ఘోరపాతిత్యమేదో ఆవిధంగా పరిణమించిన దని కొంతవరకు సమాధానపడింది. కాని, కొడుకు కోసం బెంగ పెట్టుకుని నానాటికి చిక్కి శల్యమయింది.

హేమసుందరినిచుళాపురంనించి వెళ్ళిపోయినందుకు మాణిక్యవల్లి మొట్టమొదట ఎంతయినా సంతోషించింది. స్వయంగా తానే మిక్కిలి విలువయిన తల్లినగలు కొన్ని చెల్లెలి చేతికందించింది. అర్ధరాత్రివేళ అందరు ఆదమరిచి నిద్రపోతున్నవేళ చల్లచల్లగా సాగనంపి తనమార్గం నిష్కంటకం కాగలదని ఎంతో సంతోషించింది. తెల్లవారిన తరవాత తనకేమి తెలియనట్టు, అందరితోబాటే లబో దిబోమని గోలపెట్టి గొంతెత్తి ఆక్రోశించింది.

శృంగారమంజరి తన అమూల్యాభరణాలు పోయినందు కెంతో దుఃఖించింది. ఆ మరునాడు ఆమె అన్నపానాలే ముట్టలేదు! ఎలాగో అలాగ గుండె రాయి చేసుకొని తలవరి దగ్గరికివెళ్ళి తన నగలతోబాటు, కుమార్తె నెలాగయినా ఇంటికి రప్పించవలసినదని ప్రాధేయపడింది. నాంచారమ్మ ద్వారా తిరుమలరెడ్డికి ఆ సంగతి తెలియజేసి, శాయశక్తులా సాయపడవలసిందని వేడుకొన్నది. తన మోకాలు కీలు కొంచెం నయమయిన తరవాత రంగనాయకు డెక్కడ తలదాచుకొన్నా హతమార్చివేయగలననీ, హేమసుందరిని తప్పక నిచుళాపురానికి తీసుకురాగలనని చెప్పి, రెడ్డి ఆ దాసి ముఖతః శృంగారమంజరి నోదార్చాడు.

కాని అతని మోకాలెంతకాలానికి తిన్నబడలేదు. మొట్టమొదట అది కొంచెందారిని పడుతున్నట్టే కనిపించింది. క్రమం క్రమంగా బాగా అధ్వాన్నమయింది! శల్య వైద్యులిక తాము చెయ్యగలిగిన దేమిలేదనిచెప్పి ఒక నమస్కారంపెట్టి తప్పుకొన్నారు. ఆనాటినించి రెడ్డి లోలోపల పేరుకొన్న అక్కస్సుతో అట్టుడికినట్టుడికిపోయాడు. ఎలాగో అలాగ అతికష్టంమీద మేనాలో కూర్చుని దండనాయకుని సందర్శించి హేమసుందరీ రంగనాయకుల నెలాగయినా గాలించి పట్టుకుని, నిచుళాపురానికి తీసుకొనివచ్చి తగిన శాస్తి చేయించవలసినదని అదేపనిగా మొరపెట్టుకొన్నాడు. అతడు రెడ్డి దీనస్థితి కెంతో జాలిపడి తన యావచ్ఛక్తి వినియోగించి, తప్పక ప్రయత్నించగలనని మాట ఇచ్చాడు. అయితే రాజభటుల కెవ్వరికీ కాంచీరాజ్యంలో ఎక్కడ హేమసుందరీ రంగనాయకుల జాడ కనబడలేదు! వారిద్దరు పాండ్యరాజ్యంలోనో, లేక వేరొక దూరదేశంలోనో తల దాచుకొని ఉండవచ్చునని అనుమానించారు. అయితే ఆ రాజభటుల కెవ్వరికీ పర రాజ్యాలలో ప్రవేశించే

# విశాలనేత్రాలు

అధికారంలేదు. అందుచేత వారి అన్వేషణ ప్రయత్నం యీవత్తు అంతటితో పరిసమాప్తమయింది.

తలవని తలంపుగా తిరుమలరెడ్డిమీద విరుచుకు పడిన ఘోరాపద తలుచుకొని, మాణిక్యవల్లి కుమిలి, కుమిలి దుఃఖించింది. అది గమనించి శృంగారమంజరి ఆమె గదిలోకివెళ్ళి, 'ఎందుకమ్మా! నీకీ లేనిపోని మథన! గట్టిగా తలుచుకుంటే నీకన్నివిధాల తగిన పరుసుడే దొరకకపోతాడా ఏమిటే! అదీగాక, నీవేమయినా మగనాలివా ఏమే! అయ్యో! వెర్రిదానా! ఎందుకే నీకింత చింత!' అని ఓదార్చి బుజ్జగించింది. ఆ మరునాటినించి అటువంటి అపూర్వ భాగ్యశాలి అన్వేషణలో పడింది. మరికొన్నాళ్ళు గడిచిన తరవాత సిరి సంపదలలోనేకాక, ఈవిలోకూడా తిరుమలరెడ్డినే తలదన్నగలిగిన బేహారి ఒకడు కాంచీపురంనించి తనంతట తానే స్వయంగా శృంగారమంజరి భవంతికి విజయం చేశాడు. అతనిరాకతో వెదకబోయిన తీగ అకస్మాత్తుగా కాళ్ళ కడ్డపడినట్టే ఆవేశ్యాజనని ఆనందించింది. 'మన రెడ్డికన్న ఈయనే గొప్ప ఐశ్వర్యవంతుడు. పైగా ఆయనకన్న బాగా వయస్సు ముమ్మరంలో ఉన్నాడు. ఆపైన నీవీపాటికి ఎవరినో ఒకరిని ఆశ్రయించి అంటిపెట్టుకుని ఉండకతప్పదు! అందచందాల కేమిటిలే! కొరుక్కుతింటామా! ఆ రెడ్డిమాత్రం నవ మన్మథుడా ఏమిటి? నీ వెర్రిగాని!? అని శృంగారమంజరి కుమార్తె చెవిలో మాటి మాటికి ఘోష పెట్టింది. మాణిక్యవల్లి మరి కాదనలేక ఆ బేహారితో కొంతకాలందాకా కొంచెం చాటుగానే గ్రంథం నడిపించింది. క్రమ క్రమంగా ఆ సంకోచం కూడా పూర్తిగా తొలగిపోయింది :

ఆ సంగతులన్నీ విని రవంతసేపాలోచించిన తరవాత రంగనాయకుడు తల్లి పరిస్థితిని తలుచుకుని కొంచెం విచారించాడు. కాని, తానిక చేయగలిగిన దేదిలేదని సమాధానపడి ఉసూరుమని విశ్వసించాడు.

'గోపాలయ్యా! నాకిదంతా తలుచుకుంటే ఏదో పీడకలలాఉంది! కాని, ఏమి చెయ్యను! ఏది ఎలాగ జరగవలసిఉంటే అలాగ జరిగిపోతుంది. సరేలేగాని, ఆరెడ్డికిమాత్రం మంచి శాస్తి జరిగింది! మరి తనంతటి ఐశ్వర్యవంతుడులేడని మహా మిడిసిపడి పోయాడులే!'

కాని, గోపాలయ్య కతని సంతృప్తి అంతగా రుచించక తిరిగి గట్టిగా హెచ్చరించాడు:

'రంగా! ఇల్లలకగానే పండుగ అయిపోయిందని మురిసిపోతున్నావు! కాని చిట్టచివరి కెలాగో అలాగ రెడ్డి పగతీర్చుకోకమానడు! ఇప్పటి కతగాడు కోరలూడ బెరికిన ముసలితాచులాపడిఉన్నాడు! కాని ఎప్పటికే పన్నాగం పన్నగలడో ఎవరు చెప్పగలరు! జాగ్రత్త''

రంగనాయకు డదివిని లీలగా చిరునవ్వు చిందిచాడు :

'అంతగా ముంచుకువస్తే, అప్పటిమాట చూచుకుందాంలే! ఏదో ఆ స్వామిదయవల్ల 'నీ చలవవల్ల ఇప్పటి కిలాగ బయటపడ్డానుగదా!'

అయినా గోపాలయ్య తన ధోరణి విరమించలేదు. మళ్ళీ తిరిగి చూపుడువేలెత్తి గట్టిగా హెచ్చరించాడు:

'ఇంకొక్కమాట! హేమసుందరి నీమీద వల్లమాలిన మమకారంతో తలమునకలయిపోతున్నదని మురిసిపోతున్నావు! కాని, నీ దగ్గర సొమ్ము కాస్తా అయిపోగానే, తన దారి తాను చూసుకుని ఇంకొకరి నెవరినయినా చేపట్టి తీరుతుంది! ఈవేళ కాకపోతే రేపటికయినా నే నన్నట్టు జరిగి తీరుతుంది! కొంచెం ఒళ్ళు దగ్గిర పెట్టుకుని మసులుకో!'

ఆ బెదిరింపుతో రంగనాయకుని కెంతో కోపం వచ్చింది. అయినా అతడది అతి కష్టంమీద లోలోపలే నిగ్రహించుకొని పెడముఖంపెట్టుకొన్నాడు:




'గోపాలయ్యా! హేమసుందరి మనస్సెటువంటిదో నీకు తెలియదు! ఇక ఈ గొడవ నా దగ్గిర తలపెట్ట వద్దు! అంతే! అనవసరంగా ఎందుకు నీ కీ కంఠశోష!'

ఆ ప్రత్యుత్తరంతో గోపాలయ్య మరింతగా రెచ్చిపోయాడు:

'ఇదిగో! నేనిక ఈ సంగతి నీతో ప్రస్తావించనులే! కాని ఒక్కమాట! వారకాంతల వలలో పడిన అమాయకులందరు మొట్టమొదట అచ్చంగా నీలాగే భ్రమపడ్డారు! చిట్టచివరకి తిరుమలరెడ్డి గతి ఏమయిందో చూశావుగా! ఇప్పటికయినా మించిపోయిం దేమీలేదు! కొంచెం తెలివి తెచ్చుకుని జాగ్రత్త పడు!?

రంగనాడిక స్నేహితునితో వాదం కొనసాగించదలుచుకోలేను! ఉసూరుమని విశ్వసించి, తన తుది నిర్ణయం విస్పష్టంగా వెల్లడించాడు:

'గోపాలయ్యా! మొట్టమొదట నే నిక్కడికి రావడాని కిష్టపడకపోయినా, చూచీచూడనట్టు మాట్లాడకూరుకున్నావు! ఇక ఇప్పు డిది మంచిపనికాదంటే మాత్రం లాభమేమిటి? ఇంతవరకు వచ్చిన తరవాత మళ్ళీ ఏముఖం పెట్టుకుని నిచుళాపురం రాగలను! అయినదేదో అయిపోయింది! ఏది ఏమయినాసరే, మరి వెనకంజ వెయ్యదలుచుకోలేను! అన్నిటికి తెగించే ఇక్కడికి వచ్చాను! తిరిగివెళ్ళి నా సంగతి మా వాళ్ళతో చెప్పినాసరే, మరినే నిక్కడికి రాదలుచుకోలేదు! వెయ్యి చెప్పు! లక్ష చెప్పు! దీనికిక తిరుగులేదు! అంతే!'

ఆ తరవాత గోపాలయ్య ఆమాటే తలపెట్టలేను! అంటీఅంటనట్టు రంగనాయకుని కుటుంబ పరిస్థితులడిగి తెలుసుకుని, తిరిగి తాను దిగిన సత్రానికి ప్రయాణమయినాడు. ఇంటికివచ్చి తనతోబాటు భోజనంచేసి వెళ్ళవలసినదని రంగనాయకుడు అతని ననేక విధాల బ్రతిమాలుకొన్నాడు. గోపాలయ్య కొంచెంసేపాలోచించి ఎంతో మెళుకువతో తప్పించుకొన్నాడు :

'రంగా! మీ ఇంటివస్తే ఒకటి రాకపోతే ఒకటేనా! ఈసారికి నన్ను వెళ్ళనీ! రెండు, మూడు వారాలలోనే తిరిగి ఇక్కడికి వస్తానులే! అప్పుడు తిన్నగావచ్చి, మీ ఇంటిలోనే దిగుతాను! సరిగదా! స్వామి నొకసారి సందర్శించుకోవాలని వంకపెట్టి నిజంగా నీకోసమే నే నిక్కడికి వచ్చాను. తలవని తలంపుగా నువ్విక్కడే తటస్థపడ్డావు! లేకపోతే రేపు ఉదయమేలేచి నీకోసం శ్రీరంగం అంతా గాలించిఉందును! ఇప్పుడిప్పుడే దర్శనం ముగించుకొని ప్రసాదం తీసుకొన్నాను. మరి ఆకలిలేదు. అదీగాక, రేపు మధ్యాహ్నానికి తిరిగి నిచుళాపురంవెళ్ళితీరాలి! ఇక నన్ను పోనీ!?

తనతో కలిసి భోజనం చెయ్యడానికి గోపాలయ్య కేమాత్రము ఇష్టంలేదని రంగనాయకు డూహించుకొన్నాడు! అందుచేత మరి బలవంతపెట్టలేదు. అంటీఅంటనట్టు మరికొంతసేపు తమ కుటుంబ వ్యవహారాలమీద ప్రసంగం కొనసాగించిన తరవాత స్నేహితులిద్దరు ఒకరినొకరిని వీడ్కొన్నారు.

—ఇంకా ఉంది.

అలాగే చిన్నారి కారొలిన్ కూడా నీలి నీలి కళ్లతో, ఎఱ్ఱని కేశాలు గలది. అల్లరిగా, చిలిపిగా ఒక్కొక్కసారి ప్రఖ్యాత మారిస్ షెవాలియర్ లాగ కూడా పాడేస్తుంది గొంతు మార్చి.

“నేను ఆయనా” అంటే తామూ, రాజూ, అన్న మాట. వాళ్లిద్దరికీ “పిల్లలతో కాలక్షేప మంటేనే సరదా ఎక్కువ” ని గ్రేస్ చెప్పింది.

వాళ్లతో ఈదులాటకనీ, పిక్నిక్‌లకనీ దంపతులు వెళ్తూంటారు. పిల్లలను చూసుకునే ఆయా డ్యూటీలోనికి రానప్పుడు గ్రేస్ తానే చూసు కుంటుంది వాళ్ల క్కావల్సినవన్నీ. “నర్సు శెలవులో ఉంది. నేనే పూర్తిగా వాళ్ల నిప్పుడు చూసు కుంటున్నాను” అన్నది ఆమె.

“పాపాయి కారొలిన్‌కు బొమ్మలతో ఆడుకునే ఈడే ఇది” అన్నది గ్రేస్.

‘గ్రేస్’ కుమారుడు ఆల్బర్ట్‌అలెగ్జాండర్‌కు మూడేళ్లు. సింహాసనానికి వారసుడైన అలెగ్జాండర్ పచ్చని బంగారు ఛాయలో తల్లినీ, చక్కని విగ్రహంతో తండ్రినీ పోలిఉంటాడు. “చిన్న రాజ కుమారునికి గుర్రాలంటే సర్దా. ఉయ్యాల గుర్రం అంటే చాలా సంబరం పడతాడు.” అని గ్రేస్ గొప్పగా చెబుతుంది. ఐతే ఆల్బర్ట్‌కు అసలు సిసలుగా నచ్చే గుర్రం వాళ్ల నాన్నగారే. కొయ్యగుర్రంకన్నా “నాన్న భుజాలమీద స్వారీ వాడికి మహా ఇష్టం.’

పిల్ల లిద్దర్నీ పెట్టుకుని నవ్వుతూ కేరింతల మధ్య రాజు మురిసిపోతూ ఉండటం కద్దు.

గ్రేస్‌కెల్లీ చెబుతుంది: “నాకు నా పిల్లలూ, మా ఆయనా వీళ్లే ఆశయం”.

ఐదు సంవత్సరాల సంసారిక జీవితం గురించి చెబుతూంటే కొంచెం అబ్బురంగానే ఉంటుంది. అంతే కాదు. అనగా అనగా ఒక రాకుమారుడి కథలో మాదిరిగా మొత్తానికి యీ ప్రణయగాథకు రంగస్థలంగా చరిత్ర ప్రసిద్ధిగల ‘మొనాకో’ బాగానే అమరింది.

మేం రాణిగారిని చూద్దామని, కారులో బయలు దేరాము. మెలికలు తిరిగే మార్గంలో మా కారు పైకెక్కుతూ పోయింది. ఇంతకంటే గుర్రం బండీలో వెళ్లడం మేలు అనిపించింది. సముద్రం ఉత్తరంగా అగుపించే విధంగా అగ్రం మీదికి సన్నని మార్గం గుండా రాజమందిరానికి వెళ్లాలి.

రాజమందిరం నీరెండలో తళతళమంటూ స్వప్న నగరంలాగ కనుల పండువుగా ఉన్నది. “అనగనగా రాజు, రాజకుమారైను శిఖరాగ్రాన ఒంటిస్తంభం బంగారం మేడలోనికి తీసుకొని పోడం” అనే కథలు జ్ఞాపకానికి వచ్చాయి. కోటకు బురుజులు, ఆర్చీలు, ప్రాచీనంగా, గంభీరంగా ఉన్న గోడలు, అన్నీ అద్భుతంగా ఉన్నాయి. పెద్ద ఫిరంగి ఉన్నది.

రాజమందిరానికి వెళ్లే బాట కిరువైపులా నీలి నీలి ‘కుళ్లాయిలు’ ఎర్ర చారల లాగులు, తెల్లని పటకాలు ధరించివున్న అశ్వికుల దళం లాంఛనంగా పహరా యిస్తున్నది. చిట్టచివరి కోట బురుజు మీద గ్రిమాల్డీ పతాకం రెపరెపమని ఎగురుతున్నది.

ఒక అశ్విక దళాధిపతి మమ్మల్ని “రాణిగారి మందిరానికి” అనగానే ‘సెల్యూట్’ చేసి తీసుకుని వెళ్లాడు. కోట ప్రాంగణాలగుండా మమ్మల్ని అతడు తీసుకు పోయాడు. మందిరంలోనికి ప్రవేశపెట్టాడు. ఎఱ్ఱని తివాసీలు పరిచిన మెట్లెక్కి, చలువరాళ్లు పరచిన

# గ్రేస్ కెల్లీ

24 వ పేజీ తరువాయి

నడవగుండా మేం చాలాసేపు నడిచిన తర్వాత రాణి గారి సందర్శనానికై మాకు ఏర్పాటు చేసిన మందిరం తలుపులను ఒక పరిచారకుడు తెరిచాడు.

ఆ గది ప్రశాంతతకు తోడు కమ్మని వాసనలతో హాయిగా కూడా ఉంది. కొంచెంసేపులోనే జంట తలుపులను పరిచారకుడు తెరువగా రాణి మమ్మల్ని పలకరింప వచ్చింది.. వాస్తవానికి రాణిముందు వినయంగా వంగి పలకరించాల్సి వున్నది.

వెనుకటికి ఒకసారి బకింగ్‌హామ్ భవనంలో రాణి గ్రేస్‌కు ఎలిజబెత్‌రాణి చేసిన విందులో గ్రేస్‌కెల్లీయే ఆమెముందు వంగి, అభివాదం చేసింది. ఆ విందు

ఒక అమెరికన్ మిత్రుడు దేశ విస్తృతినిగూర్చి చెప్తూ ఇలా అన్నారు. “పొద్దున్న టెక్సాస్‌లో స్టేట్ ఎక్స్‌ప్రెస్‌ను ఎక్కితే 24 గంటల తర్వాత కూడ మీరు ఇంకా ఆ టెక్సాస్‌లోనే వుంటారు.”

“అవునవును! అలాంటి రైళ్ళు ఇక్కడకూడా వున్నాయిలే” అన్నాడు రైళ్ళ ఆలస్యపు ప్రయాణానికి అలవాటుపడిన భారతమిత్రుడు.

శారద (మద్రాసు)

సందర్భంలో ఎలిజబెత్‌రాణి, రాణిగ్రేస్ కెల్లీ పట్ల చాలా కుతూహలం అగుపరిచింది. శ్రద్ధగా సినిమా గురించి తారాపథం గురించి కూడా ప్రశ్నలు వేసింది.

“నే చూసినవా రందరికన్నా చాలా అందంగా ఉన్నది మొనాకో రాణి” అని ఎలిజబెత్‌రాణి స్వయంగా విందు ముగిసిన తర్వాత చెప్పింది కూడా.

అది సరే : ఇప్పుడు మాకు ఎదుట ఉన్న రాణి గ్రేస్, ఆమెఆఖరి చిత్రం స్వాన్ (హంస) లోని ‘రాణి’ అంత హుందాగాను, అందంగాను అగుపించింది.

చక్కని ట్వీడు దుస్తుల్లో గులాబీరంగు వేళ్లమీద కాంతులు ప్రతిఫలిస్తుండగా ఆమె కొత్త వెలుగులా ఉన్నది. లేత సూర్యకిరణాలయొక్క బంగారు వన్నెలకు మల్లే ఆమె పెట్టుకున్న నగలు పసిడికాంతుల నీనుతున్నాయి. ఒక చేతికి బంగారు గాజు, రెండోచేతికి బంగారు గొలుసు గడియారం గ్రేస్ ధరించి ఉన్నది.

ఇంక ఆమె చిరునవ్వు సంగతి వేరే చెప్ప నక్కర్లేదుకదా. లోతైన ఆమె చూపులలోని ఆర్ద్రభావం చిరునవ్వులో సాధారణంగా చూపరుల నాకట్టుకుంటుంది. సాదరంగా ఆమె కళ్లద్దాలు లేనిదే ఎవరికీ దర్శన మివ్వదు. మామూలుగానే ఆమె హ్రస్వదృష్టి గలది గనుక సులోచనాలు వాడుతుందే గాని మా ఎదుటికి వచ్చినప్పుడు ఖరీదైన, ఆమె కళ్లజోడును అందమైనవేళ్ల మధ్య పట్టుకునే వచ్చింది.

గ్రేస్‌కెల్లీ అందం గురించి రాజా రైనీర్ గర్వ పడతాడు. ఆయ నంటాడు కూడా. “ఏ ఫోటోలో నైనా సరే మా ఆవిడ యించక్కా అందంగా పడుతుంది. నేనే గెడ్డం క్రింద గెడ్డం ఉన్న రాక్షసునిలా పడతాను” అని. గ్రేస్‌కెల్లీ సకాకళా నిజంగా రాణివాసానికే పుట్టిందా. అన్నట్లు హుందాగా ఉంటుందని రైనీర్‌కు చాలా గర్వం కూడాను.

గ్రేస్‌కెల్లీ పాత నేస్తాలలో ఒకామె జన కుమారి వెరా మాక్స్‌వెల్ యిలా చెప్పింది. “గ్రేస్ కెల్లీ వైవాహిక జీవితంలో సమస్యలు లేవు అనటానికి వీల్లేదు. పెళ్లి అన్న తర్వాత ఏ పెళ్లిలోనైనా కాస్త ఒడుదుడుకులు, చిక్కులు తప్పవు. అలాగని గ్రేస్ కూడా మునుపు అనుకోలేదు. అంత మాత్రాన “నాకు సుఖం లేదో నాకు సంతోషం లేదో అంటూ వాపోయే రకం మాత్రం కాదు మా గ్రేస్. ఆమెకు వాస్తవానికి కళ్యాణానంతరం కొత్త దేశం, కొత్త భాష, కొత్త మనుషులు యిత్యాది సమస్య లనేకం ఉత్పన్నమయ్యాయి.” అని

ఆమె యింకా చెప్పినదాన్ని బట్టి రాణి కెల్లీ యీ యిబ్బందులను రాజిన్నది. నిజంగా యిది కాస్త శ్రమతో కూడినపనే గాని “కెల్లీ” కి మనోబలం ఉన్నది. ఈమె ఆత్మస్థైర్యమే, బహుశా రాజును తొలిసారి ఆకర్షించిందేమో కూడా నంటుంది మాక్స్‌వెల్.

అలాగే గ్రేస్ కూడా రైనీర్‌లో చాలా అసాధారణమైన గుణాలను పేటెన్ చూసివుంటుంది. తొలి సమాగం ఆవిధంగానే ప్రారంభమై యీ ప్రేమాయణానికి నాంది పలికింది.

అస లిదంతా ఎలా ప్రారంభమైందంటే .... ఈ ప్రథమ సమాగాన్ని ఒక ఫ్రెంచి పత్రికాధిపతి ‘పియేర్‌గాలంట్’ అనే వ్యక్తి ‘కేన్స్’ చిత్రోత్సవంలో పాల్గొనాలని గ్రేస్‌కెల్లీ వెళ్లినప్పుడు ఏర్పాటు చేశాడు. అప్పుడు చలనచిత్రోత్సవంలో గ్రేస్‌కెల్లీ నటించిన అకాడమీ అవార్డు చిత్రం కంట్రీగర్ల్ (పల్లెపిల్ల)ను ప్రదర్శించారు.

రాజు రైనీర్ స్నేహితులతో, ఏదో విందుకు హాజరై తిరిగి వచ్చేలోగా కాస్త ఆలస్యమైందేమో యీలోగానే గ్రేస్ రాజమందిరంలోపలి భాగం చాలా వరకు చూసేసింది. అందుచేత రైనీర్ ఆమెను ఉద్యానవనాలకు తీసుకుపోయాడు.

రాజుగారి సొంత జంతు (ప్రదర్శన) శాల దగ్గరికి వాళ్లు వచ్చేసరికి గ్రేస్‌కెల్లీకి చాలా బోనులు, అడవిమృగాలు అగుపించాయి.

మామూలుగా రాకుమారుడికి అడవి మృగాలను పట్టి తెచ్చి అందులో పెంచడం సరదా. అలవాటుగా ఓ పులి బోనులో రైనీర్ తన చెయ్యి దూర్చాడు.

“అమ్మో!” అని గుండెలమీద చెయ్యి వేసుకుంది గ్రేస్.

“అలాంటప్పుడు మీరేనా అంతే చేస్తా రన్న” ది మాకేసి తిరిగి ఆమె.

మీరు మాత్రం భయపడరా ? ఆ బోనుతో










# గ్రేస్ కెల్లీ

పెద్దపులి ఉంది." అన్నది గ్రేస్ ఈ ఉదంతం చెబుతూ.

ఐతే ఆవేళ రాజు గ్రేస్ భయం క్షణంలోనే తొలగించాడు. మచ్చికగా ఆ పులిని దువ్వి చెయ్యి ఇంచక్కా తీసేసు కున్నాడు.

"అలా అకస్మాత్తుగా జరిగిన సమావేశం కాస్సేపే ఐనా చాలా గమ్మత్తుగా జరిగింది."

అటు తర్వాత డిసెంబర్ నెలలోనే మొనాకో రాకుమారుడు పర్యటనార్థం అమెరికాకు వచ్చాడు.

1955 వ సంవత్సరం క్రిస్టమస్‌నాడు బాగా పొద్దుపోయిన తర్వాత మొనాకో ప్రభువు రైనీర్ ఫిలడెల్ఫియాలోని కెల్లీ భవనానికి వెళ్లాడు. అక్కడా మరికొంచెంసేపూ గ్రేస్‌గారి అక్కయ్య శ్రీమతి జ్యార్జిడేవిస్ యింట్లోనూ; సరదాగా కాలం గడిచిపోయింది.

అటుతర్వాత అదే శీతకాలంలో యీ గ్రేస్ రైనీర్‌ల జంట న్యూయార్క్ ప్రాంతంలో విహరిస్తూ చాలాసార్లు అగుపించారన్నది నిజం. డిసెంబరు 29 వ తేదీనాడు గ్రేస్ వాళ్ల అమ్మకు టెలిఫోన్ చేసింది.

"అమ్మా!! నేను‥ నేను … ప్రేమలో పడ్డా"నని ఫోను పెట్టేసింది.

సరే …. ఆవిధంగా అందాల అమెరికను తార ఓ "రాకుమారుణ్ణి" పెళ్లాడే ఘటన సంభవమైంది.

గ్రేస్‌కెల్లీ వాళ్ల అమ్మా నాన్నకు మూడో ముద్దుబిడ్డ. 1929 సం. నవంబర్ 29 న పుట్టింది గ్రేస్‌కెల్లీ. తండ్రి జాన్ బ్రేండన్ కెల్లీ. అతని తండ్రి ఐర్లెండు కాలనీ ఐన మేయోకు చెందిన వ్యవసాయం పనివాడు. గ్రేస్ తల్లి అదివరకు స్త్రీల వైద్య కళాశాలలో (ఫిలడెల్ఫియా)లో వ్యాయామ శిక్షకురాలిగా పనిచేసింది. ఆమె పేరు మార్గరేట్ మేజర్.

"మా నాన్నగారు తొమ్మిదిమంది సంతానంలో ఏడవవారు" అని చెప్పింది మొనాకో రాణి తన తండ్రి గురించి. "మా పెద్దనాన్నలలో ఒకరికి కట్టడాలు, నిర్మాణాలకు చెందిన వ్యాపారం ఉండేది. ఆయన కోసరం మా నాన్నగారు బ్రిక్‌కీపర్ గాను, కార్మికునిగాను, తాపీ మేస్త్రీ గాను కూడా పనిచేశారు." అన్న దామె.

ఐతే ఆయన తన ముప్పైయవ ఏట తానే వ్యాపారంలో ప్రవేశించా లనుకున్నాడు. అతనికి ఒక సోదరుడు "చా చా" ప్రదర్శనలివ్వడంలో ప్రఖ్యాతి గలవాడు చాలా సాయం చేశాడు. మరో యిద్దరు అన్నదమ్ములు కూడా యీయనకు చాలా సాయం చేశారు. జార్జి నాటకాలు రాసే సోదరుడైతే,'పాట్రిక్' కంట్రాక్టర్ గనుక యిద్దరూ గ్రేస్ తండ్రి జాన్ బి. కెల్లీకి ఆర్థికంగా తోడ్పడగా అతను ధనవంతుడు కాగలిగాడు.

నిజానికి 1960 లో జాన్ బి. కెల్లీ మరణించే సరికి అతడు చెప్పుకోగలిగినంత ధనవంతు డయ్యాడు

గ్రేస్‌కెల్లీ ఫిలడెల్ఫియా పాఠశాల లన్నింటిలోకి ఖరీదైనా, వ్యయం కోరే, కాథలిక్ బళ్లో (అకాడమీ ఆఫ్ ది అస్సమ్షన్ : రేవెన్‌హిల్) చదువుకుంది. ఆతర్వాత జెర్మన్ టవున్‌లోని స్టీవెన్స్ బాలికల పాఠ

శాలలో చదువుకుంది.

"నాకు యింగ్లీషన్నా, చరిత్ర అన్నా చాలా యిష్టంగా ఉండేది" అంటుంది గ్రేస్.

ఇక భాషల్లో ఫ్రెంచి, స్పానిష్, లాటిన్ లంటే మోజు. తను చాలా ఎక్కువగా "ఫీల్డ్ హాకీ" ఆడే దాన్నని కూడా గ్రేస్‌కెల్లీ చెప్పింది. ఆమె స్టీవెన్స్ స్కూలు హాకీ టీములో నాలుగు సంవత్సరా లున్నది. ఓ ఏడాది బాస్కెట్‌బాల్ బృందంలోకి ఎన్నికైంది.

పదమూడో ఏటనే గ్రేస్‌కెల్లీ తొలిసారిగా ఒక యువకునితో సరదాగా వెళ్ళి బాస్కెట్‌బాల్ ఆట చూపింది. అదివరకూ మగపిల్ల లెవరితోనూ నేస్తంగా ఆమె యెక్కడికీ వెళ్ళలేదు. బంతి ఆట చూసిం తరవాత ఆ యిద్దరూ కలిసి నడిచి, వీళ్ళ యింటికి ఓ మైలు దూరాన గల విలియమ్ పెన్ ఛార్టర్ స్కూలులో డాన్సు చేశారు. ఆ అబ్బాయి పేరు హార్పర్ డేవిస్.

1947 వ సంవత్సరం వీళ్ళ స్కూలు వార్షిక సంచిక తీసి చూస్తే గ్రేస్‌కెల్లీ బొమ్మవేసి దాని క్రింద యిలా రాసివుంది. "ఈపిల్ల నాటకాల్లో వేయడానికీ, సినీతార కావడానికీ అవకాశాలు చాలా ఉంటాయి."

ఐతే: "నన్ను సాధారణంగా అబ్బాయి వేషాలు అంటే, మగ వేషాలు వేయమనే ఎన్నికచేస్తూ ఉండే వారు అన్నదామె.

ఆపిల్ల ఆడపిల్లల బళ్ళో చదువుకుంటూ ఉండేది గనుక మగ వేషాలు కూడా అమ్మాయిలే వేస్తారు గనుక గ్రేస్‌కెల్లీ పొడుగ్గా సన్నంగా ఉండేది గనుకా యీ వేషాలు ఆ పిల్లకే యిస్తూవుసేవారు.

తన పదిహేడో యేట గ్రేస్‌కెల్లీ గ్రాడ్యుయేట్ కోర్సు చదువుకుంటూ "పీటర్ పాన్" వేషం వేసింది.

శైశవావస్థ గురించి ఆమెను ప్రశ్న అడిగితే పదమూడో యేటినుంచి పందొమ్మిదీ వరకు గల ఏళ్ళు తల్చుకుని "అమ్మ బాబోయ్! చాలా కష్టం కదూ?" అన్నది. "ఆ దశ చాలా గమ్మత్తయింది. ఏదో భయం, ఆందోళన వీటికి తోడూ ఉద్వేలం గానూ, అదో ఉత్సాహంగానూ గడిచిపోయాయని. నేనంతగా పదిమందిలో రాసుకుని తిరిగేదాన్ని కాదు" అంటుంది గ్రేస్.

తాను సాధారణంగా ఏకాంతంగానే ఉండేదిట. "ఏమో అదంతా మరీ సంతోషంగా గడచిన వయస్సు కాదు" అన్నదామె కాస్సేపాగి పై మాటలు చెప్పి.

ఇంకా పద్దెనిమిదోఏడు రాకండానే ఆమె న్యూయార్కులోని నాటకకళా అకాడమీలో శిక్షణకు వెళ్ళింది. వెర్మాంట్‌లోని బెన్నింగ్‌టన్‌లోని కాలేజీలో చేరుదా మనుకుంది గాని, అవకాశ మయింది కాదు. కొన్ని యోగ్యతా పత్రాలు అవి చాలేయికాదు. అంచేత స్త్రీలకు ప్రత్యేకంగా ఉన్న బార్బి జాన్ హోటల్లో ఉంటూ రెండేళ్ళు అకాడమీలో చదువుకుంది. మొదటి ఏడాది అమ్మా, నాన్నగారే జీతం, భత్యం చూశారు కాని రెండో ఏడాది తానే సొంత కాళ్ళమీద ఆధారపడ్డదిట గ్రేస్.

"ఫొటోగ్రాఫిక్ మాడల్" (చిత్రకారులని నమూనా) గా పనిచేసే దామె. మొదట్లో తన కది చాలా కష్టంగా తోచేది. కాని రాను రాను అలవాటై రోజూ పని చేయగలిగేది. గంటకు ఏడున్నర డాలర్లు సంపాయించేది. ఎందుకంటే ఆ రోజుల్లో ఎక్కువ మంది మోడల్స్ (నమూనా సుందరులు) దొరికే వారు కాదు. పైగా 15, 20 డాలర్లు గంటకు పుచ్చుకునేవారు బహు అరుదు. ఐతే యీమెకు మాడల్‌గా ఖ్యాతి రేటూ పెరుగుతూండగానే న్యూయార్కు నగరంలో ఒక నాటకంలో మంచి అవకాశమే దొరికింది.

"కాని నమూనా సుందరిగా పనిచేయడం నాకు చాలా యిష్టంగా ఉండేది." అని గ్రేస్ కెల్లీ చెప్పింది. "అదో గమ్మత్తయిన అనుభవం." అంటుందామె.

కాని అప్పుడు ఆమెకు కాస్త బరువుగా "ఉన్నాననే" సమస్య ఉండేది. కాస్త మామూలు యువతులకన్నా స్థూలంగా ఉండేది గ్రేస్. అంచేత సాధారణంగా యీమె చిత్రం ప్రకటనలకు వాడుకునే వారు. ఎక్కువగా షాంపూలు (తలంటుకునేది) బీరులూ అవి గ్రేస్ బొమ్మతో ప్రకటనలకు యిచ్చే వారు. సిగరెట్ల ప్రచారానికి గ్రేస్‌కెల్లీ బొమ్మ ఎక్కువగా వాడేవారు. కాని కెల్లీ పొగ త్రాగదు!

1947 వ సం. లో గ్రేస్‌కెల్లీ నాటక కళ అకాడమీలో చేరగలిగింది. రెండేళ్ళ తరువాత 1949 వ సం॥ లో బ్రాడ్వేలోని కార్ట్ థియేటర్‌లో వేసిన "ది ఫాదర్" (తండ్రి) అనే నాటకంలో గ్రేస్‌కు మంచి పాత్ర లభ్యమైంది. ఆ నాటకం ప్రదర్శించడం మానేసిం తర్వాత గ్రేస్‌కెల్లీ ఎక్కే గుమ్మం దిగే గుమ్మంగా నాటకాల వేషాలకై తిరిగింది కాని ఫలితంగా నిరుత్సాహపడిపోయింది. ఐతే ఆమెకు విరివిగా టెలివిజను కార్యక్రమాలలో వేషాలు దొరికేవి. అరవై డెబ్భై పైచిలుకుగా ఆమె టెలివిజన్ నాటికలలో వేసింది, సోమర్‌సెట్ మామ్ కథల మీద ఆధారంగా ప్రసారంచేసిన 'సీరీస్' లో ఆమె పాల్గొన్నది. మరికొన్ని డిటెక్టివ్ నాటకాలలో కూడా ఆమె ప్రసారమైంది.

'బెజరీ మెన్ యిన్ ఏక్షన్' లాంటివి అప్పటి ఆమె టెలివిజన్ నాటకాలు. తర్వాత డెన్వర్‌లో ఒక బృందంతో కలిసి వారానికో కొత్త నాటకం చొప్పున పది వారాలు నాటకాలలో పాల్గొన్నది. ఒక్క "కౌంటీ" థియేటర్‌లో ఆమె రెండు నాటకాలలో రెండుపాత్రలను నటించింది. అది పెన్సిల్వేనియా లోని న్యూహోప్‌లో జరిగిన సంగతి.

మొదట ఆమె వేసిన నాటకం పేరు "దిహైరెన్ (వారసులు). రెండోదానిపేరు "టార్చ్ బేరర్స్."

అంతా అయిన తర్వాత గ్రేస్‌కెల్లీ కాలిఫోర్నియాకు వచ్చి "ఫోర్టీన్ అవర్స్" (పధ్నాలుగు గంటలు) సినిమాలో వేసింది.

ఆనాటి సినీ కాలం తల్చుకుని తనకు వచ్చిన అదృష్టమేదీ కూడా ఒక్కసారి "ఠక్కి" మని రాలేదనీ అవకాశమైనా అదృష్టమైనా ఒక మెట్టుకో మెట్టే వస్తుందనీ గ్రేస్‌కెల్లీ అన్నది. "నాకు కలిగిన అవకాశాలు ఒకదాని కొకటి దోహదించాయి. నే పెద్దతార నయ్యే నప్పుడు." అంటుందామె.

అలా కథ రక్తిగడుతూ ఓనాడు సినీతార కథ సినిమా కథలాగ గమ్మత్తుగా మారిపోయింది. రాకుమారుడు రావడం, వరించడం, పెళ్లిచేసుకోడం అంతా సినిమాకు మల్లే జరిగిపోయింది.

ఇంకా ఉంది.










# నరబలి

17-వ పేజీ తరువాయి

నలిగినట్టు కనిపిస్తున్నాయి. పక్కమీదినుండి ఓ మొగ్గ చేతిలోకి తీసుకుంది.

"ఛా, అన్యాయం, ముడికి అర్ధచంద్రాకృతిలో మాల అమరిస్తే ఆయన కెంతో ఇష్టం. ఈరోజు ఆయన రాకముందే అవి వాడిపోతున్నాయి."

ఆమెదృష్టి కొంగువైపుకు వెళ్ళింది. కొంగు భుజంమీదినుండి జారి, పక్కమీద పడిఉంది. తెల్ల చుక్కలున్న నల్లటి బట్టమీద చీర కుచ్చిళ్ళు సరిచేసుకుంది. క్రిందపడిన కొంగు తీసి రొమ్ముమీదుగా ఎడమ భుజంమీద వేసుకుంది. ఆశ్చర్యంతో ఆమె కళ్ళు పెద్దవయ్యాయి. 'ఏమిటిది? కొంగు సిగరెట్టు వాసనలో అద్దినట్టుంది. సిగరెట్టు కంపుతో బాటు, ఉన్మాదకరమైన సెంటువాసన కూడా వస్తోంది. సెంటువాసన, సిగరెట్టుకంపు తమింట్లోకి ఎలా వచ్చినయ్? తను ఎప్పుడూ సెంటు వాడి ఎరగదు. వాసు సిగరెట్టు ముట్టి ఎరుగడు. అయినా సిగరెట్టు, సెంటుల పరిమళం గదిని ఆక్రమించుకుంది. రత్న ప్రశ్నార్థకంగా చుట్టూ చూసింది. 'నలిగిన మొగ్గల వాసనే అలా అనిపిస్తోందా'? అనుకుంటూ కొంగువాసన మళ్ళీ చూసింది. 'ఖచ్చితంగా సిగరెట్టు కంపే. అయితే ఇంకెవరో ఇంటికి వచ్చిఉండాలి...... గడ్డకట్టిన మనస్సుమీద మరిగే నీళ్ళు చల్లినట్టయింది. రత్న కెవ్వున కేకవేసి, రెండు చేతులతోనూ మొహం కప్పుకుంది. ఆమె దేహం గడగడా వణికిపోయింది. "అయ్యో! ఎంతపని జరిగిపోయింది!" అని ఆమె హృదయం ఆక్రోశించింది. రత్న మంటలో పడిన తీగెలా అయిపోయింది. దుఃఖం పొర్లుకొచ్చింది. ఏడ్చి ఏడ్చి అలసిపోయింది. కాని, మనసులోని ఆవేదన తగ్గలేదు. కళ్ళలోని నీళ్ళంతా ఇంకిపోయాక, ఆమెకు తనమీద, వాసుమీద, ప్రపంచంమీదనే కోపం ముంచుకొచ్చింది. ఆ ఆవేశంలో చేతిలోని జేబురుమాలును చింపి ముక్కలుచేసి పారవేసింది.

గడియారం తొమ్మిదిన్నర కొట్టింది. గంట శబ్దం విని అదిరిపడింది రత్న. అది గడియారపు శబ్దమే. దానికి భయపడనక్కరలేదు.

రత్న గాజులులేని తన చేతిని చూసుకుంది. గదిలో పోట్లాట జరిగిన గుర్తులింకా ఉన్నాయి. పగిలిన గాజుముక్కలు క్రిందపడి ఉన్నాయి. కుర్చీ తలక్రిందులుగాపడిఉంది. చేతిలో గాజు గుచ్చుకున్న చోట రక్తం కారుతోంది.

రత్న ఏడుపు దిగమింగుకుని లేచింది. క్రిందపడి ఉన్న గాజుముక్కలను ఏరి, కిటికీలోనుండి బయట పారవేసింది. మల్లెమొగ్గలను ఏరి చెత్తబుట్టలో వేసింది.

వాసుకు తన ఈ విషయం తెలిస్తే? ఆమె వంటిమీద మంచు కురిసినట్టయింది. భర్తకుమాత్రం ఎలా తెలుస్తుందా సంగతి? తను నోరు విడిచి చెపితే గదా! తను చెప్పకుండాఉంటే? ఓహో! ఎలా ఈ మలినదేహంతో అతనితో జీవించటం జరిగిందిక, చెప్పేస్తే? ఉహూ. వాసు తనను తిరస్కరిస్తే ఏం చేయటం? ఇంత పెద్ద ప్రపంచంలో అతనుతప్ప

వేరెవరూ లేరు. తనకు. చెప్పకపోవటమే మంచిది. ఈ ఆరని మంట తనలోనే ఉండనీ. దీని వేడి కూడా ఆయనకు తగలకూడదు. ఆయన మన్నిత హృదయం తట్టుకోలేదు. అయినా తన మొహంచూసి గ్రహిస్తే? రత్న అద్దంముందు నిల్చుని తన మొహాన్ని పరీక్షించు కుంది. విరిసిన పుష్పానికి అగ్నిచుంబనమయితే పుష్పం వాడిపోవటం ఎంతసేపు? ఆమె శరీరంలోనుండి, చీరెలోనుండి సిగరెట్టు, సెంటుల వాసన వస్తున్నట్టనిపించింది. రత్న జుగుప్సతో మొహం ముడుచుకుంది. ఆమె పెదవులు, బుగ్గలు తేలు కుట్టినట్లు మండుతున్నాయి. తువ్వాలు భుజంమీద వేసుకుని నీళ్ళ గదివైపు నడిచింది.

వాసు ఇంటికి వచ్చే టైము దగ్గరపడుతున్న కొలదీ ఆమె మనస్సులోని వ్యాకులము ఎక్కువ కాసాగింది. ఒకవేళ వాసుకు తెలిస్తే ఏమవుతుంది? కోపంతో ఇంటినుండి వెళ్ళగొడతాడా? ఆయనకు తనంటే ఎంతో ప్రేమ. కాని, ఆ ప్రేమ ద్వేషంగా మారితే? ఉహుం. అతని కీ విషయం తెలిస్తే భరించ గలడా? అతనికోసమయినా తను చెప్పకపోవటమే మంచిది......ఆమె మనస్సు మంటలో పడినట్టుంది. "పసిబిడ్డలాటి హృదయం భర్తది. అతడికి ద్రోహం చేయటమా......"

"రత్నా......రత్నా......తలుపు"

ఓహ్! ఆయన వచ్చేశారు! ఈ మొహం ఎలా చూపటం? నా నోటితో నేను చెప్పకపోయినా, నా మొహమే ఆయనకు అంతా చెప్పేస్తుంది అనుకుంటూ, అద్దంలో తన మొహం చూసుకుంది. భయంతో చెదురుతున్న కళ్ళు, తెల్లబడిన మొహం, వణుకుతున్న కాళ్ళు! ఏదో జరిగిందని ఆయనకు తెలిసిపోతుంది. తప్పదు. ఏంచేయను? అనుకుంది.

"రత్నా......" వాసు తలుపు తడుతున్నాడు.

రత్న పెరటి తలుపువైపు చూసింది. ఆయన అక్కడుండగానే ఇటు తలుపు తీసుకుని వెళ్ళిపోనా? అనుకుంది. కాని, ఈ రూప యవ్వనాలతో ఎక్కడికి పోతుంది తను?

"ఓ రత్నా......"

ఏదో అవ్యక్తమైన శక్తిచేత ముందుకు తోయబడి, వెళ్ళి తలుపు తీసింది రత్న. వాసు లోపలికి రాగానే లేనికోపం చూపుతూ, "రాణీగారికి నిద్ర వచ్చిందేమో" అన్నాడు అక్కడే కుర్చీమీద కూర్చుని బూటుదారాలు విప్పుతూ.

"......"

వాసు తలపైకెత్తి ఆమె మొహంవైపు చూశాడు. అతడి మొహంలోని నవ్వు మాయమయింది.

"ఏం రత్నా అలా ఉన్నావు? ఏమన్నా ఉత్తరాలొచ్చాయా? అంతా కులాసాయే గదా?"

"నాకెందుకో ఈ ఇల్లు ఇష్టంలేదు. వేరే ఇంటికి వెళ్ళిపోదాం" రత్న భర్తమాటకు జవాబు చెప్పకుండా తనకు తోచింది మాట్లాడింది. వాసు ఆశ్చర్యంతో, "నా ప్రశ్నకు జవాబు రాలేదే?"

"ఈ ఇల్లు వద్దు. వెళ్ళిపోదాం."

"ఎందుకు? ఇప్పుడేమయిందీ ఇంటికి?" వాసు ఆమెనే అనుసరించి మాట్లాడాడు.

"ఈ కొండల్లో, గుట్టలలో ఒంటరిగా బ్రతకటం నా చేతకాదు."

"ఈ ఇల్లు బాగా లేదా?"

"ఇల్లేమో బాగానేఉంది. కాని, చుట్టూరా ఇళ్ళుంటేనే కదా మంచిది. పట్టపగలు తల పగలకొట్టినా అడిగేవాళ్ళుండ రిక్కడ."

"సరే చూద్దాం. వెతికి చూస్తాను."

"వెతికి చూస్తానంటేకాదు. ఇంకా నేను బ్రతికి ఉండాలని మీకు ఉంటే వెంటనే వేరేఇల్లు చూడండి"

"రత్నా!!"

రత్న మొహం తిప్పుకుంది.

"ఎందుకిలా మాట్లాడుతున్నావు? ఒంట్లో కులాసాగాఉందికదా?" అంటూ లేచివచ్చి, నుదుటిమీద చెయ్యివేసి చూశాడు వాసు.

రత్న విసురుగా చెయ్యితీసివేసి "వదలండి. నాకు చచ్చిపోయేంత జబ్బేమీ రాలేదు" అంది. ఆమె కంఠస్వరాన్ని విని ఆశ్చర్యపోయాడు. వాసు దూరంగా జరిగి, భార్యవైపు పరీక్షగా చూశాడు. రత్న ఎప్పటిలా లేదు. ఏదో మార్పు వచ్చింది ఆమెలో. కొంతసేపు అలాగే చూస్తూ ఉండిపోయాడు. తరువాత మాట మారుస్తూ, "మల్లెపూలంటే నీ కెంతో ఇష్టం. మాలతెచ్చినా పెట్టుకోలేదేం?" అన్నాడు.

ఆ మాట శూలంలా గుచ్చుకుంది రత్నకు. వెంటనే తేరుకుని, "ఓ అదా! సంజీవరావుగారి భార్య వస్తే ఇచ్చాను...."

"అలాగా. మంచిదయింది. ఇవిగో కొత్త పూలు తెచ్చాను. పెట్టుకో" అంటూ సంచిలోనుండి పూలు పైకి తీశాడు.

రత్న విసుగ్గా, "ఉండనివ్వండి. ముందు మీరు భోజనానికి లేవండి" అంటూ ఇక అక్కడ ఉండకుండా వెళ్ళిపోయింది.

వాసు మాట్లాడకుండా వెళ్ళి, పీటమీద కూర్చున్నాడు. మౌనంగానే భోజనం పూర్తయింది. అడిగిన దానికంతా రత్న ముక్తసరిగానే జవాబిస్తోంది. మజ్జిగ పోయటానికి వంగినపుడు ఆమె చేతిలో గాజులు లేకపోవటం గమనించాడు వాసు.

"గాజులు ఏమయ్యాయి రత్నా? గాయం కూడా అయినట్టుందే?" అన్నాడు ఆదుర్దాతో.

ఓ నాటకం రిహార్సలు జరుగుతున్నాయి: "ఆమాట కర్థమేమిటో తెలియటం లేదండి" నటుడు డైరక్టరుతో మొరపెట్టుకున్నాడు.

"ఆఁ అదీ! దారికి వస్తున్న మాట! నీకు, నాకు, దాని వ్రాసిన వాడికి, దాన్ని విన్నవాడికిఅర్థం కాకపోతనే అది కళ. ఆ మాట కళాత్మకం. ఊఁతే."

అని తాత్పర్యం చెప్పాడు దర్శకుడు. తారకేశ్వర రావు.

తారక రామారావు (తిరిగోప్పుల)

గొంతుదాటివస్తున్న సత్యాన్ని అతి ప్రయాసతో ఆపుకుని, "నీళ్ళు తోడేటప్పుడు కాలుజారిపడ్డాను. గాజులన్నీ పగిలిపోయాయి" అంది రత్న.

"ఏంపిల్లరా బాబూ, సరిగ్గా నడవటం కూడా చేతకాదు" అని నవ్వుతూ, ఆమె బుగ్గ గిల్లాడు. కళ్ళనుండి ప్రవహించేందుకు సిద్ధంగాఉన్న కన్నీళ్ళను అతడికి కనపడనీయకుండా మొహం ఇంకోవైపుకు తిప్పుకుంది రత్న.

వాసు తన భోజనం కాగానే, "నువ్వు కూర్చో రత్నా! నేను వడ్డిస్తాను" అన్నాడు.

"నాకు భోజనం చేయాలనిలేదు. ఒద్దు" అంది రత్న.

"కొంచెం నేనే తినిపిస్తాగా......" అన్నాడు వాసు.

"ఉహుఁ" అంటూ రత్న భర్తకన్నా ముందే బయటికి వచ్చేసింది. ఇక చేసేదిలేక అతడూ లేచి బయటకు వచ్చేశాడు. తమలపాకుల పళ్ళెం అతని ముందుంచి, గోడవైపు మొహం పెట్టుకుని పడుకుంది.

వాసు ఇక భరించలేకపోయాడు. పగలంతా శ్రమపడి, అలసివచ్చిన అతడికి భార్య నవ్వుమొహం, సరసపు మాటలతో శ్రమంతా పరిహారమయ్యేది. ఆమె స్నేహంతో, ప్రేమలో అన్నీ మరిచి హాయిగా గడిపేవాడు. ఎప్పటి సరసం, చిరుకోపం లేకపోవటంతో ఆ రోజు రసవిహీనంగా కనపడింది. రత్న ఎప్పుడూ ఇలా ప్రవర్తించలేదు. ఏదో పెద్ద కారణమే ఉండి ఉండాలి అనుకున్నాడు.

గోడవైపు మొహంపెట్టి పడుకున్న భార్యను బలవంతంగా తనవైపుకు తిప్పుకున్నాడు. రత్న రెండు చేతులతోనూ మొహం కప్పుకుంది. వాసు ఆ చేతులు తీసివేయడానికి ప్రయత్నించాడు.

"లైటు వెలుగు భరించలేను. కళ్ళు మండుతున్నాయి" అంది రత్న.

"నావేపు చూడు" అంటూ ఆమె చేతులు తీశాడు. రత్న అతడి మొహం చూడటానికే భయపడింది.

"నామొహం చూడటానికే భయపడతావేమిటి? నేనేం పెద్దపులినికానే?" అంటూ ఆమె మొహాన్ని చేతులతో నిమిరి, నుదుటిమీదపడ్డ ముంగురులను వెనక్కి తోశాడు.

"ఇదేమిటి రత్నా? మొహంమీద గాయం? ఏమయింది? ఎలా తగిలింది? బుగ్గమీద ఈ గుర్తేమిటి రత్నా? మందు వేయలేదుకదూ? సెప్టిక్ అయితే ఏం గతి? అస లింతకూ ఏం జరిగింది?"

"ఏంలేదు. సంజీవరావుగారి బాబు వచ్చాడు గదా! రానంటూంటే ఎత్తుకున్నాను. బాగా గీరేశాడు."

"పోనీ మందు వెయ్యకూడదూ? ఇకమీదట వాడిని ఎత్తుకోకు. వ్యాసలైన్ ఏదీ......పోనీ జాంబక్ ......" అంటూ హడావిడిగా గదంతా కలయ దిరిగాడు.

"ఏదీ వద్దులెండి. అదే పోతుంది."

వాసు ఆమె మాటలు వినకుండా జాంబక్ వెతికి తెచ్చి బుగ్గమీద రాశాడు.

"కొంచెం మంట తగ్గిందికదూ?"

"ఊఁ..."

పామాలివ్ సౌందర్య రక్షణ

# మీ దేహకాంతికి క్రొత్త శోభనిస్తుంది!

మీ దేహకాంతికి క్రొత్త శోభను చేకూర్చుకోగలరు. పామాలివ్ సౌందర్యరక్షణతో దానిని ఎంతో మృదువుగా, తాజాగా ఉంచుకోండి.

మొదటి రోజు నుండే, పామాలివ్ సౌందర్య రక్షణ మీ దేహకాంతికి క్రొత్త శోభను యిస్తుంది. భారత దేశపు అపూర్వమగు సౌందర్య పోషక తైలములు చేరిన పామాలివ్ సబ్బు ఎంతో సౌమ్యమైనది, మరియు శుద్ధమైనది. దాని సమృద్ధియగు మీగడ వంటి నురుగు ఎంతో శుభ్రపరచి, మీకు క్రొత్త శోభను చేకూరుస్తుంది. సౌందర్య పోషక తైలములు చేరిన పామాలివ్ సబ్బునే ఎల్లప్పుడూ వాడి చిన్న చిన్న కళంకములు చాల తక్కువగుట, ఎక్కువ మృదుత్వము, మరియు నునుపు, తాజాయైన మరియు నిర్మలమైన చర్మము, ఎక్కువ శోభాయమానమైన అందమగు దేహకాంతి మొదలైన వర్చస్సులో కలిగే అభివృద్ధిని మీరు చూడగలరు!



భారతదేశపు అపూర్వమగు
సౌందర్య పోషక తైలములతో
తయారైనది!






పూర్తిగా సౌందర్యముగా కనపడుటకు పామాలివ్ సబ్బుతో స్నానము చేయండి!

PSO-8-18-TEL.

# నరబలి

"ఇక నా దగ్గరకు రావటానికేం అభ్యంతరం లేదుకదూ?"

"నాకు నిద్దరొస్తోంది" అంటూ రత్న ముసుగు నిండుగా కప్పుకుని పడుకుంది.

పడుకుందేగాని, నిద్రాదేవత ఆమె ఛాయలకు కూడా రావటంలేదు. అశాంతితో పక్కమీద పొర్లు తూనేఉంది. "విషం, పన్ను, విషం"

రత్న హృదయంలో చిచ్చుపెట్టినట్టుంది. నోరు విప్పి, జరిగిన విషయం భర్తతో చెప్పుకోటానికిలేదు. చెప్పకుండా ఉండటమూ చేతకావటంలేదు. అడ కత్తెరమధ్య చిక్కుకున్నట్టుగా నలిగిపోతోంది ఆమె కోమల హృదయం. పగిలిపోతున్న కణతలను రెండు చేతులతోనూ, గట్టిగా అదిమి పట్టుకుని, నిద్ర పోతున్న భర్తను దీనంగా చూసింది.

వాసు శాంతంగా నిద్రపోతున్నాడు. ప్రశాంత మైన వెన్నెలకాంతిలో అతడి మొహం స్పష్టంగా కనిపిస్తోంది. నిద్రాదేవి ఒడిలో విశ్రమిస్తున్న అతడి మొహంలో పసివాడి ముగ్ధత కనిపిస్తోంది. వాసు నిద్రలోనే కలవరించాడు.

"రత్నా......గాయం.....ఎందుకిలా ఉన్నావు?"

రత్న హృదయం ప్రేమతో పులకరించింది. నిద్రలోనూ అతడికి తన ధ్యాసే. ఓహ్! వాసు తన నెందు కింతగా ప్రేమిస్తున్నాడు. కొంచెం తక్కువగా ప్రేమించగూడదూ. నిద్రిస్తున్న అతడి మొహం అమాయకంగా, ముద్దుగా కనిపించింది. నుదుటిమీద ముద్దుపెట్టుకుందామని ముందుకు వంగిందామె. పిపాసతో నిండిన రెండు నల్లటి కళ్ళు వచ్చి వారిద్దరిమధ్యా అడ్డుగా నిలిచాయి. రత్న బెదరి, వెనుకకు తగ్గింది.

* * *

రత్న పట్టుదలవల్ల వాసు కష్టపడి చుట్టూ ఇళ్ళుఉండే చోట్లో వేరే ఇల్లు చూశాడు. ఇల్లు మారితేనైనా రత్న విచిత్ర ప్రవర్తన మారవచ్చు నని ఆశించా డతడు. కాని, అదేమి ఫలించలేదు. కొత్త ఇంటికి వచ్చి, రెండు నెలలు దాటిపోయాయి. రత్న ప్రవర్తనలో ఎక్కువ మార్పేమీ రాలేదు. ఏదో పరధ్యానంగా ఉదాసీనంగా ఉండేది. ఒక్కోమారు భర్తనే అపరిచితవ్యక్తిని చూసినట్టుగా చూసేది. తను కడుపుతో ఉందన్న విషయం తెలియగానే పిచ్చిపట్టినంతపనయింది రత్నకు. మనసులో మెదిలిన శంకతో ఆమె హృదయం విలవిలలాడింది.

'ఆ భయంకరరాత్రి పరిణామమే ఇది అయిఉంటే..? లేకపోతే తమ దేనేమో! తమ ఇద్దరి ప్రేమఫలమే కావచ్చును. మధురభావనతో ఆమె హృదయం వికసించబోయి, అంతలోనే ముకుళించింది. ఊహూ..... కానేకాదు. తన పెళ్ళయి నాలుగు సంవత్సరాలయినా ఇంతవరకూ పిల్లలు పుట్టలేదు. పుట్టే ప్రాప్తి ఉంటే ఇంతకుముందే పుట్టాల్సింది. కాదు. కానేకాదు. పుట్టబోయేబిడ్డ తమదికాదు. తను మోస్తున్నది పాపఫలం. ఆ బిడ్డ పుట్టాక తన గతి శత్రువులకూ ఒద్దు. ఆ బిడ్డ మొహం అస్తమానం ఆ దుర్ఘటనను, ఆ పాపి మొహాన్ని గుర్తుకు తెస్తూంటుంది. తప్పదు. దేన్నయితే తను మరిచిపోవడానికి ప్రయత్నిస్తోందో అది తనను ప్రాణం ఉండేవరకూ ఒదలదు. నిరంతరమూ తనముందు రూపందాల్చి, పెద్దదై తన కళ్ళముందే తిరుగుతుంది.

తుఫానులో చిక్కిన చిన్ని నావలా తల్లడిల్లింది ఆమె మనస్సు.

ఆరోజునుండి రత్న అతనికి మరింత దూరంగా ఉండసాగింది. తను ఏ జన్మలో ఏ పాపంచేసుకుందో ఇప్పుడు అనుభవిస్తోంది. అది ఆ రాత్రితోనే తీర లేదు. తనలోనే లీనమై, తనను సర్వనాశనం చెయ్య గలదని అనుకోలేదామె.

రత్న తల్లి కాబోతోందని తెలియగానే వాసుకు కలిగిన సంతోషానికి పారమే లేదు. "రత్నా, నీకు కొడుకు కావాలా, కూతురా?" అని అడిగిన వాసు తనలోని సంతోషభావాలనే ఆమె మొహంమీద చూస్తా ననుకున్నాడు. కాని, రత్న మొహంలో దుఃఖం, కలవరం చోటుచేసుకున్నాయి.

భర్త ఉత్సాహం, సంతోషంచూసి "ఎందు కనవసరంగా సంబరపడుతారు? అది మీ బిడ్డకాదు" అని గట్టిగా అరవాలనిపించేది. దావానలంలా తనను దహిస్తున్న ఆ పాపపు బరువును లాగి బయట పార వేయాలనిపించేది.

"ఏంపిల్లా? మాట్లాడవు?"

"......"

పాలిపోయిన మొహం, కాంతిశూన్యమైన కళ్ళు, ముడివడిన కనుబొమలను చూసి చకితుడయ్యాడు వాసు. భార్యదగ్గరగా వచ్చి, ఆమె చేతులు పట్టుకుని మృదువుగా, "ఏం, నీకు పిల్లలు కావాలనిలేదా?" అన్నాడు. రత్న చేతులు వదిలించుకుని, గదిలోకి పారిపోయి తలుపు వేసుకుని, పక్కమీదపడి ఏడవ సాగింది. రత్న ఏడుస్తోందని తెలుస్తూనే ఉంది వాసుకు. కాని, ఎంత తలుపుతట్టినా, రత్న తలుపు తెరవలేదు.

అయితే రత్నకు పిల్లలు కావాలనిలేదా? తనకు తల్లి కావటం ఇష్టంలేదా? కాపురానికివచ్చి నాలుగేళ్ళయినా తనకు పిల్లలు పుట్టలేదని రత్న ఎన్నో మార్లు చిన్నబుచ్చుకుంది. ఆ బెంగ పోగొట్టటానికి తను "మనం ముసలివాళ్ళం కాలేదుగా" అనేవాడు. ఈ సుదినంకోసమే తామిద్దరూ ఎంతో ఆతృతతో ఎదురు చూస్తున్నప్పుడు రత్న ఇలా ప్రవర్తించటం అతడిని ఆశ్చర్యపరిచింది.

గర్భంతోపాటు, ఆమె మనోవ్యథ, బెంగ కూడా పెరగసాగింది. ప్రతిక్షణమూ బిడ్డ ఎవరిది అన్న జిజ్ఞాస ఆమెను పీడిస్తోంది. జబ్బేమీ లేకుండానే రత్న కృశించిపోసాగింది. భర్త ఆమెకు ఏ విషయంలోనూ లోటు కలుగనివ్వలేదు. పాలు, పళ్ళు బలవంతాన తినిపించేవాడు. కాని, భార్య రోజు రోజుకూ ఎముకలపోగై పోతూంటే చూడలేకపోయేవాడు.

ప్రేమగా బతిమాలుకుంటూ ఎన్నో విధాలుగా అడిగిచూశాడు. కాని, రత్న పెదవి కదపలేదు. భార్య ఏదో బాధపడుతోందనిమాత్రం అతడికి స్పష్ట మయింది. అదేమిటో ఎన్ని విధాలుగా బుజ్జగించినా, రత్న చెప్పలేదు. సాధ్యమయినంతవరకూ రత్నను ఒంట రిగా వదిలేవాడుకాదు. ఒకరోజు శూన్యంలోకి చూస్తూ తన ఆలోచనా సముద్రంలోనే మునిగిపోయిన రత్నను తట్టిలేపి, "పద రత్నా, మంచి పిక్చరొచ్చింది. వెడదాం" అన్నాడు.

"నేను రాను. మీరు వెళ్ళండి" అంది రత్న ముభా వంగా. వాసుకు ఇలాంటి జవాబులు ఈమధ్య బాగా అలవాటయిపోయాయి.

"నువ్వు రాకపోతే నేను మాత్రం వెళ్ళటం దేనికిలే" అని చిన్నబుచ్చుకున్నాడు. వాసు మొహం చూసి, రత్నకు జాలివేసింది. అతడికి తనమీదున్న ప్రేమా, తనను ఎలాగైనా సంతోషపెట్టాలని అతడు పడు తున్న శ్రమా రత్నకు తెలియిందేమీకాదు. తన మనసులోని బాధ దాచుకోలేక ఈమధ్య చాలా మార్లు అతడి ఇష్టానికి విరుద్ధంగా ప్రవర్తించి, అతిడిని నొప్పించింది. అలా చేసినప్పుడల్లా అంతకు రెట్టింపుగా బాధపడేది తనూ. నిరాశతో నిండిన అతడి మొహంచూసి, "పదండి వెడదాం" అంది.

వాసు సంతోషానికి పారమే లేదు. పదపదమని హడావిడి చేశాడు.

"రత్నా, ఆ తెల్లచుక్కలున్న నల్ల చీర కట్టు కుని తెల్లటి చోళీ వేసుకో. అది నీకెంతో బాగుం టుంది. ఈమధ్య నువ్వు కట్టుకున్నట్టు లేదు."

ప్రేమతో భర్త దగ్గరగా వచ్చి నిల్చున్న రత్న సర్పదర్శనమయినట్లు ఒక్కడుగు వెనక్కువేసింది.

"ఆ చీర చిరిగిపోతే పనిమనిషి కిచ్చేశాను."

"అదేమిటి రత్నా, అది కొని ఇంకా ఆరునెలలు కూడా కాలేదు. అప్పుడే చిరిగిపోయిందా?" అన్నాడు. వాసు ఆశ్చర్యంతో.

"అవును. ఆ చీరె చిరిగిపోయింది" అంది రత్న. నా మాట మీరు నమ్మి తీరాల్సిందే అన్నట్టుంది ఆమె మాట్లాడిన తీరు—అందులో సహజత్వంలేదు. ఆమె అంతరంగాన్ని చీల్చి చూస్తున్నట్టుగా సూటిగా చూశాడు వాసు. ఆ తేనెరంగు కళ్ళలోని తీక్షణతను భరించలేక రత్న అక్కడినుండి వెళ్ళిపోయింది.

పురుటిరోజు దగ్గర పడుతున్నకొలది రత్న ఆవే దన తీవ్రం కాసాగింది. 'బిడ్డ భర్తలాఉంటే తన హృదయం మీదనుండి పెద్ద భారం దించినట్టవు తుంది. తేనెరంగు కళ్ళు, అంత నలుపుకాని జుట్టు, ఎర్రటి దేహచ్ఛాయ.....బిడ్డ భర్తలా ఉండదు. అతని దయితేకదా అతనిలా ఉండటానికి' నల్లటి కళ్ళు, నల్లని వెంట్రుకలు, నల్లటి ఒంటిరంగు కల బిడ్డ అస్పష్టంగా ఆమె కళ్ళఎదుట గోచరించింది. ఆమె అసహ్యంతోనూ, భయంతోనూ వణికిపోయింది.

ప్రసవవేదనకన్నా, మనోవేదనే ఆమెను ఎక్కువ బాధ పెట్టింది. అంత బాధలోనూ, ఆమె డాక్టర్లు,

# నరబలి

నర్సుల మొహాల్ని పరీక్షగా చూస్తోంది. అందరూ తనను నీచంగా చూస్తున్నట్టే అనిపించింది. నర్సు లిద్దరు ఏదో నెమ్మదిగా మాట్లాడుకొని చిన్నగా నవ్వుకున్నారు. 'ఇంకేముంటుంది తనను గురించే అనుకుని ఉంటారు. ఈమె పతిత. ఈ పుట్టబోయే బిడ్డ ఈ భర్తదికాదు' అనేఉంటారు.

"ఏమండీ రత్నా! పాపాయి మీలాగానూ లేదు, మీవారిలాగానూ లేదు. ఎవరి పోలికండీ?" అని పక్కింటి కమలగారు అడిగితే? గదిలోని ప్రతి వస్తువూ తనను వెక్కిరిస్తూ, హేళనగా నవ్వుతున్నట్టని పించింది. ఇక భరించలేక కెవ్వున కేకవేసింది.

మళ్ళీ తెలివి వచ్చేటప్పటికి రత్నకు బాధేమీ లేదు. అంతా నిశ్శబ్దంగాఉంది. ప్రశాంతమైన నిశ్శబ్దం అది. రత్న కిటికీగుండా చూసింది. నీలాకా శంలో నక్షత్రాలు మెరుస్తున్నాయి. అయితే బిడ్డ

---

భార్య చేసిన పిండివంటలు తింటూ "చాలా బాగున్నా యనక తప్పదు" అని మెచ్చు కున్నాడు పరంధామయ్య.

"ఏం నాయనా! అంత బాగున్నవా పదార్థాలు" ఆప్యాయతతో అడిగింది తలుపు చాటున నిల్చున్న అత్తగారు.

"అబ్బే! బాగున్నా యనలే దండీ! "బాగున్నా యనక తప్పదు అని మాత్రం అన్నాను" భార్యవేపు బిక్కు బిక్కు మని చూస్తూ సమా ధానం చెప్పాడు పరంధామయ్య.

రామారావు (గుంటూరు.)

---

పుట్టి, ఎన్నో గంటలయిఉంటుంది. రేపు తననూ, బిడ్డనూ చూడవచ్చే భర్తకు మొహం ఎలా చూపటం? ఆమె కళ్ళనీళ్ళతో తలగడ తడిసిపోయింది. కాని సమస్య పరిష్కారం కాలేదు.

ఉదయం ఆరుగంటలకే వాసు ఫ్లాస్కులో కాఫీ తీసుకుని వచ్చాడు. వాసు రావటం అంతదూరంలో ఉండగానే గమనించిన రత్న మెదలకుండా కళ్ళు మూసుకుని పడుకుంది. ఇంకేం పిడుగులాంటి ప్రశ్న తనమీద విరుచుకుని పడుతుంది అని ఎదురు చూస్తోంది రత్న.

"రత్నా"

వాసు ధ్వని మృదువుగా ఉంది. అందులో కఠి నత్వపు ఛాయలు కూడా లేవు.

తన్ను చూసి జాలిపడు తున్నాడు. అంతే అనుకుంది రత్న కళ్ళు తెరచింది. భర్తవైపుకు చూసే ధైర్యంలేక కప్పుకేసే చూస్తోంది.

"రత్నా! బిడ్డను గురించి బెంగపెట్టుకోకు. బిడ్డ ఏడిస్తే నీ నిద్ర చెడుతుందని వేరేచోట పడుకో బెట్టారు. నేను నిన్న సాయంకాలమే చూశాను. ఆరోగ్యంగా ఉన్నాడు. ఏనిమిదిన్నర పౌన్లు ఉన్నాడు మన బాబు. నీకు రాత్రి బాగా నిద్రపట్టిందా? కులాసాగా ఉన్నావుకదా?" అన్నాడు సంతోషంతో పొంగిపోతూ.

"బిడ్డమీది ఎలా అవుతుంది? నా పాపఫలం" అని భర్తతో చెబుదామనుకుంది. అంతలోనే బిడ్డను తెచ్చి నెమ్మదిగా రత్న పక్కలో పడుకోబెట్టింది నర్సు. రత్న బిడ్డను చూడటానికే భయపడి ఇంకోవైపుకు తిరిగింది.

"నీ కొడుకును చూడు రత్నా! ఎలా ఉన్నాడో?"

రత్న బలవంతాన తలత్రిప్పి ఒక్కసారి బిడ్డను చూసినట్టుచేసి అటు తిరుక్కుంది. అస్పష్టంగా కన్పిం చిన బిడ్డ రూపు ఆమెలో సంశయాన్ని రేపింది. తనలోని చైతన్యాన్నంతా కూడదీసుకుని మళ్ళీ చూసింది.

"తేనెరంగు కళ్ళు, అంత నలుపుకానిజుట్టు, ఎర్రటి దేహచ్ఛాయ, భర్తకు ఉన్నట్టుగానే బుగ్గ మీద నల్లటి మచ్చ....."

దేహం పట్టుతప్పింది. రత్న పిచ్చిదానిలా ముందుకు వంగి రెండు చేతులతోనూ బిడ్డను ఎత్తుకుని గట్టిగా హృదయానికి హత్తుకుంది. ఆమె గట్టిగా పట్టుకోవటంతో బిడ్డ చేతులూ, కాళ్ళూ కొట్టు కుంటూ ఏడవసాగింది. అదేమీ గమనించకుండానే రెండురోజుల పసివాడిని గట్టిగా పట్టుకుని ముద్దు పెట్టుకుంటూ, "బిడ్డ మనదే......మనదే...... మన బిడ్డే......" అంది.

ఆమె కంఠస్వరం క్షీణిస్తోంది. ఆఖరి మాట గొంతులోనే ఉండిపోయింది. బిడ్డను పట్టుకున్న ఆమె చేతులు తమ శక్తిని కోల్పోయాయి. బాబు ఆమె ఒళ్ళోనుండి జారిపోయాడు. నర్సు పరిగెత్తు కుంటూ వచ్చి బిడ్డను ఎత్తుకుని ఓదార్చసాగింది. వాసు కంగారుగా "రత్నా, రత్నా" అని పిలిచాడు.

రత్న ఏదో చెప్పటానికి ప్రయత్నించింది. కాని, ఆమె నోటినుండి శబ్దం వెలువడలేదు. పెదిమలు చలించాయి. రత్న తన హృదయంలోని ప్రేమనంతా కళ్ళల్లో నింపుకుని అతనివైపు చూసింది. ఆమె కళ్ళల్లో మరణయాతన అనుభవిస్తూన్న ఛాయ లున్నా, పెదిమలు తృప్తితో నవ్వుతున్నాయి. మొహం లో ఇన్నిరోజులూ కనిపించని శాంతి, తృప్తి, సంతోషం తాండవిస్తున్నాయి. రత్న తన చేతిని వాసు చేతిమీద పెట్టింది. "మన బిడ్డ" అన్న మాటలు ఆమె నోటి నుండి అతి ప్రయాసతో వెలువడ్డాయి. ఆమె కంటినుండి ఒక్క చుక్క కన్నీరుపడి బుగ్గ మీదుగా జారిపోయింది. భర్తను చూస్తున్నట్టుగానే ఆమె కళ్ళు మెల్లిగా మూతపడ్డాయి. ★

# చిత్ర మోదము

15 — వ తేదీ తరువాయి

"ఏమీలేదు, ఆలోచన" అన్నాడు మహాశయుడు.

"సినిమా తియ్యటానికి నేను అంగీకరించను" అన్నాడు నిదానంగా ధనవంతుడు. కుమారరత్నం హైజంపు చేశాడు.

"వాట్! ఫాదర్, యు ఆర్ వాట్ ఫాదర్, మై ఫాదర్, డార్లింగ్" అంటూ వెర్రెత్తిపోయాడు.

"తగ్గు" అన్నాడు ధనవంత.

రత్నం తగ్గాడు.

"ఐతే నేనే చిత్ర నిర్మాతగా వ్యవహరిస్తాను" అన్నాడు ధనవంత.

"మీకు తెలిదుగానా— ఓల్డ్ ఐడియాస్ మీవి. ఏ సంపూర్ణ రామాయణమో తీస్తానంటారు మీరు"

"అబ్బాయ్, మహాశయా! నువ్వు చెప్పిన కథలను బట్టి నాకు సర్వం అర్థమైంది. వాటన్నింటినీ చక్కదిద్దుకుని, నేనే చిత్రం నిర్మిస్తాను. ఈ విషయాలన్నీ నువ్వు చెప్పినందుకు థాంకులు. కథ నిర్ణయం దర్శకుడికీ, రచయితకూ వదిలేస్తాను. ఎంతైనా డబ్బుకు వెనుకాడను. పెట్టవలసినచోట బాగా ఖర్చు పెడతాను. ఎవరికీ డబ్బు ఎగవెయ్యను. వేషాలు ఇస్తానని పదిసార్లు ఎవర్నీ తిప్పను. ఇస్తే ఇస్తేనంటాను— లేకపోతే లేదంటాను. నాతో పని చేసే వాళ్లందరినీ మర్యాదగా మంచిగా చూస్తాను. అబద్ధాలు చెప్పను. మోసాలు చెయ్యను. నా కథ ఏమిటో, నా సినిమా ఏమిటో, నా కంపెనీ ఏమిటో— అంతే. ఇతరుల గొడవలూ, గోలలూ తలపెట్టను. కేవలం డిస్ట్రిబ్యూటర్ల డబ్బులమీదే ఆధారపడను. పరిశ్రమలోని నలుగురితోనూ కలిసి కట్టుగా, ఐకమత్యంగా, సఖ్యతగా ఉంటాను. ఐతే ఇంత మంచి తనంవుంటే సినిమా ఏం తీస్తారని నువ్వు అడగొచ్చు! అదే గమ్మత్తు. ఇంతమంచితనంతోనూ నేను తీస్తాను. మంచితనమూ, క్రమశిక్షణా కావాలి. అవి వుండి తీసేవాళ్ల చిత్రాలు బావుంటాయి. నేను తీసే చిత్రమూ బావుంటుందనే నా విశ్వాసం" అన్నాడు ధనవంతుడు—ఉపన్యాసంలా ఇచ్చి.

మహాశయుడు సంతోషం పట్టలేక మూర్ఛపోయాడు.

తన ఛాన్సు తన తండ్రి కొట్టేశాడని కుమార రత్నం మూర్ఛపోయాడు.

"ఆరెరే!......ఏమిటది? ఏం జరిగింది? శాపం పొందినట్టు ఇద్దరూ ఈ మూర్ఛలేమిటి?...... ఒరేయ్, నౌకర్లా, చాకర్లా......" అని ఆత్రుతగా కేకలు వేశాడు ధనవంతుడు. నౌకర్లూ, చాకర్లూ పరుగు పరుగున వచ్చారు.

"నీళ్లు......నీళ్లు......"

నీళ్లు వచ్చాయి. వాళ్లిద్దరి ముఖాలమీద నీళ్లు జల్లాడు—ధనవంతుడు. ఇద్దరూ లేచి కూచున్నారు.

"నాన్నా! చాలా అన్యాయం నాన్నా! చాలా అన్యాయం. ఈ ఐడియా అసలు నాకు జన్మించింది మొదట. నేనుచెప్పినప్పుడు, మీరు మొదట కాదన్నారు. అంతా విన్నాక మీరే సినిమా తీస్తానంటారా? కాస్సేపు పోతే వేషం కూడా వేస్తానంటారు. నే నొస్తు



సి.బర్మా ఫిలింస్ వారి "మహాభారతం"లో మహీపాల్, నిరూపరాయ్.

కోను. ప్రథమంలోనే మీరు ఇట్లా పరుల ఐడియాలు కాపీ కొట్టేశారు. పైగా అన్యాయం చెయ్యను— మోసం చెయ్యను అంటున్నారు. నాన్నా! నా కల నిజమవదా? నా స్వప్నం ఫలించదా? నా కోర్కె సిద్ధించదా? నేను నిర్మాతగా ఉండి, మంచి చిత్రం తీస్తాను. ఇతర మోజుల్లో పడను. అనవసరంగా కార్లలో తిరిగి పెట్రోలు ఖర్చుచేసి పోజులు కొట్టను. బాకులు కొట్టను నన్ను నమ్మండి ఫాదరూ. నన్ను నమ్మండి....." అని ప్రాధేయపడ్డాడు కుమార రత్నం.

"సరే చూదాం. ఐతే నిర్మాతవు నువ్వే. కాని— దగ్గరుండి డబ్బూ అదీ నేను ఖర్చు చేస్తాను" అన్నాడు ధనవంత.

"నాన్నా" అని కాళ్లమీద పడ్డాడు రత్నం.



శ్రీ ప్రపూర్ణ వారి "ఇరుగు — పొరుగు"లో కృష్ణకుమారి, రామారావు.

# చిత్రమోదము

"మీరెంత మంచివారు, నాన్నా — మీరెంత మంచి వారు" అన్నాడు.

"అయ్యా మరి నా మాట?" అన్నాడు మహాశయ.

**"మావాడి మాటయిందిగా, ఇంక నీ మాటా?"**

"నన్ను దర్శకునిగా తీసుకోండని మొదటే అడిగాను. తీసుకుంటారనే ఆశతోనే ఈ కథల్ని చెప్పాను. అసలు సినిమా అంటే ఏమిటో ఎరగనివాళ్ళు ఇన్ని విషయాలు తెలుసుకుని, నన్ను అన్యాయం చేస్తారా? మోసం చెయ్యనని అన్నారు. నన్ను మోసం చేస్తున్నా రు కా రా.....స్తున్నారుకారా.....కారా......" అంటూ విలపించసాగాడు మహాశయ.

"బస్సా—రైలా—విమానమా అని కూడా విలపించు నాయనా మహాశయా! లే చెబుతాను...... నువ్వు చెప్పిన కథలనుబట్టిచూడగా నువ్వు మంచి వాడివేననిపించావు. నీ కష్టాలన్నీ జాలిగాథలై ప్రసిద్ధికెక్కేంత జాలిగా ఉన్నాయి. ఆల్‌రైట్—నువ్వేనా దర్శకుడివి" అన్నాడు ధనవంత.

"ధన్యోస్మి......ఈసారి చూడండి. ఎంత పకడ్బందీగా, కట్టుదిట్టంగా పిక్చరు తీస్తానో."

"నాన్నా, మరి కథ?"

"కథ—మనం అక్కడికివెళ్ళి రచయితచేత రాయించాలి. నువ్వూ, నేనూ రాస్తే మళ్ళీ మనవాడు ఖేదంలో పడి కథలు చెబుతాడు. ఎవరు చెయ్యవలసినపని వాళ్ళు చెయ్యాలి. అది నేర్చుకో ముందు నువ్వు" అన్నాడు ధనవంతుడు.

"ఐతే నాకు డైరక్షన్ ఛాన్సు ఇచ్చినట్టేనా?" అని మళ్ళీ అడిగాడు మహాశయ, నసుగుతూ.

"నేనేం—నీ పాత నిర్మాతననుకున్నావుటయ్యా—మాటంటే మాటే"

"నాన్నా, నేనే నిర్మాతను ఐతే—మళ్ళీ మీరు కూడా ఎందుకు నాన్నా—"

"ఆమాత్రం పెద్దదిక్కు లేకపోతే అంతా కుర్రవాటంగా తయారవుతుంది."

"జై మా నాన్నకు జై—జై దర్శకుడు మహాశయకూ జై, జై నాకూ జై......జై జై" అంటూ సంతోషంగా అరవసాగాడు రత్నం.

"నాయినా, ఇప్పుడింక అరుస్తూ కూచుంటావా ఏమిటి? మనం ప్రయాణ సన్నాహాల్లో ఉండాలి మరి!"

* * *

ఆవిధంగా ఆ ముగ్గురూ చిత్రమోదమున్న పొందినవారై, మంచి పద్ధతుల్లో ఒక మహత్తర మహాజ్యాల చిత్ర నిర్మాణానికి ముందంజలు వేస్తూ, ఆ మర్నాడు ఒకటోరకమైన టిక్కట్లు కొనుక్కుని మద్రాసు రైలెక్కారు!

'శుభమ్'




















# బంగారు పంజరం

9—వ పేజీ తరువాయి

ఇంటిబాధ్యతలన్నీ నెత్తిమీదున్నాయి. అందుకని వ్రాయటం పడలేదు.

ముఖ్య విషయం నేను తాత్కాలికంగా మీ మరిదిగారి స్కూల్లో ఖాయంగా పని చేస్తున్నాను. ఆశ్చర్యంగా ఉంది కదూ ? వీలైతే తర్వాత ఉద్యోగం ఇస్తానన్నారు. మొదట్లో కష్టంగా ఉండేది గాని ఇప్పుడు డలవాటైంది. ఇద్దరం జంటగా వెళ్ళి జంటగా రావటంలో ఎంతైనా ఆనందముంది.

మామగారు మంచివారు. పూజ్యులు. నన్ను కన్న కూతురులా ప్రేమిస్తారు. మీ మరిదిగారు కూడ ఇంతవరకు యే విషయాలలోను నన్ను బాధపెట్ట లేదు. ఏ విషయంలోను నీతో పోల్చరు. అంతటి విశాల హృదయులు చాల అరుదుగా ఉంటారు కదూ ? మనిద్దరిలాగే నళిని, కుసుమలు గూడ పెళ్ళయి సుఖించాలని సర్వదా భగవంతుని ప్రార్థిస్తున్నాను.

తన సంపాదన పోయిన వెల నించి చాలటం లేదు. మామగారు వృద్ధులు కదా—ఏదో ఒక జబ్బు వారికి మందులు, మంచి భోజనం, పండ్లు ఇత్యాదులకోసం డబ్బు బాగా ఖర్చు పెట్టాము. మా పెళ్ళికి వారు చేసిన అప్పు కూడ ఉంది. తనకు నూటపది రూపాయ లిస్తారు. మామూలు రోజుల్లో సరిపోతుందిగానీ మామయ్యకు జబ్బు చేయటంతో మా స్థితి దిగజారిపోయింది. ఇంతలో యీ ఖాళీ ఏర్పడింది. నా కోసమే అన్నట్లు. వెంటనే చేరుతా నన్నాను. మామయ్య తటపటాయించారు. వారి కిష్టంలేదు. ఎలాగైతేనేమి ఇద్దరం కలసి ఒప్పించాము.

వారి వాదన—"కోడలిచేత పని చేయిస్తున్నార"ని లోకు లంటారట. మా కాలంలో యిలా జరిగి ఉంటే .... అంటూ ఏదో అంటారు. కానీ అక్కయ్యా! నా అభిప్రాయ మేమంటే—కందుకూరి వీరేశలింగం పంతులుగారు స్త్రీ ఔన్నత్యం సుఖం, కోసం పాటుపడ్డారు — వారు జన్మించిన తర్వాతనించి స్త్రీ కొక నూతన యుగం ప్రారంభమైంది. స్త్రీ విద్య, వితంతు వివాహాలు బాల్య వివాహాలు రద్దు చేయటం—యిలాంటివి శతాబ్దారంభం నుంచే ఉన్నాయికదా, యీ గడిచిన సంవత్సరాల నుంచి మన స్త్రీజాతి కొంతవరకు మాత్రమే ముందంజ వేసింది. ఎందు కంటావు? తగిన దోహదం లేకనా ? లేక మానవుల సంకుచిత స్వభావాలు నమసిపోకనా ? మామయ్య మాట మాటకి "మా కాలం" అంటారే—ఆ కాలంలో గూడ పై చెప్పిన సంస్కరణలున్నాయిగా? స్త్రీ పనిచేసినా, యెక్కువ విద్య నభ్యసించినా, త్వరగా పెళ్లి చేసుకోకపోయినా ముందా స్త్రీలే ఎంతో నిరసిస్తారు. ఇన్ని సంవత్సరాలుగా మారని స్త్రీ గుణం యిప్పట్లో మారదంటూ నేను తనూ ఎంతగానో చెప్పి ఒప్పించగల్గాము.

ఎస్సెల్సీ పూర్తిచేస్తే నాపని ఖాయమయ్యే అవకాశాలు లున్నాయట. పాస్ మార్కులు తెచుకుంటే

చాలు. ఇంగ్లీషులోనేగా ఫెయిల్ అయ్యాను. ఈ సెప్టెంబరుకో, మార్చికో కట్టాలనుకున్నాను. మీ మరిది గారు నాకు ట్యూషను చెబుతున్నారులే.

పై పనికి పనిమనిషుంది. నీళ్ళు చేది తోటకు పోయటం మామయ్యగారి అవసరాలు తను చూచుకుంటారు. వంట, చదువుతో నాకు సరిపోతుంది. భోంచేసి బడికి వెళ్తాము. మధ్యాహ్నం వచ్చి కాఫీ త్రాగి మామయ్యగార్ని పరామర్శించి తిరిగి వెళ్తాము.

బడి చాల దగ్గరే. మామయ్యగార్కి సుస్తీగా ఉన్న రోజుల్లో పనిమనిషుంటుంది. ఆరోజు దానికి డబ్బు యెక్కువివ్వాలి.

అక్కయ్యా—ఎన్ని బాధ్యతలు, పనులో చూడు. కానీ, మనసిచ్చినవారికి మనస్ఫూర్తిగా సేవ చేయటంలో ఎంతో ఆనంద ముంది. ఏమంటావు ? కన్న తండ్రిలా చూచుకునే మామగారు, ప్రాణప్రదంగా చూచుకునే భర్త ఉంటే నా కింకేం కావాలి ? అందుకే నా హృదయం భారంగా లేదు.

నా విద్యుక్త ధర్మాలను తన సహాయంతో నెరవేరుస్తుంటే జీవితం సుఖంగా, శాంతంగా గడిచిపోతుంది .... "ఆమె పని చేస్తోందిట" అని వింతగా చెప్పుకుంటున్నారు గూడా."

అందర్నీ పరామర్శిస్తూ వసంత ఉత్తరం ముగించింది. నిర్మల ఉత్తరం చదివి ఆలోచిస్తూ కూర్చుంది. భర్త రాకను లేశమంతైనా గమనించలేదు.

"నా నిమ్మి హృదయ భావాలను నానుంచి దూరం చేసిన దుర్మార్గు లెవరు ?" అంటూ ఆమె ప్రక్కన కూచున్నాడు.

"వసంత వ్రాసింది—అలా దాన్ని గూర్చి ఆలోచిస్తూండిపోయాను".

"పోనీలేగాని అంత దీర్ఘంగా ఆలోచించదగ్గ సమస్య లేమన్నా వచ్చాయా ?" ఆందోళన వ్యక్తమయ్యే కంఠంతో అడిగాడు.

నిర్మల "మీరే చదవండి" అంటూ ఉత్తరం అందించింది.

ప్రకాశ్ చదవటం పూర్తిచేశాడు. "ఇందులో నీ వంతగా ఆలోచించదగ్గ విషయా లేమున్నాయి నిమ్మీ" ఆప్యాయంగా అడిగాడు.

"వసంత అంతా పెద్ద తరహాగా వ్రాస్తే ఎంత మారిపోయిందో అని తలుస్తున్నా నంతే. దానికసలు ఎస్సెల్సీ పూర్తిచేయాలన్న పట్టుదల గల్గటమే పెద్ద వింత. పనిచేసేటంత ధైర్యం ఎక్కడినించి వచ్చిందా అని మరీ ఆశ్చర్యంగా ఉంది."

"ఆశ్చర్య మేముంది నిమ్మీ. ప్రతివాళ్ళలో కొన్ని అంతర్గతశక్తు లుంటాయి. అవకాశం లేకనో, ధైర్యం లేకనో, సరియైన దోహదం లేకనో అవి మాటుమణిగి ఉంటాయి. సరియైన వాతావరణం యేర్పడి పురిగొల్పేవారుంటే అవి బయట పడతాయి. మా తమ్ముడు మంచి నేర్పరిలా ఉన్నాడు.

నిర్మల నవ్వింది. "మీ తమ్ముడు నేర్పరైతే మాత్రం, మా చెల్లిలో నిగూఢమైన శక్తు లుండబట్టే-కదా వారు సత్ఫలితాన్ని పొందగల్గారు ?"

ప్రకాశ్ నవ్వాడు. "జవాబు వ్రాసేప్పుడు వసంతకు వ్రాయి, నే నిలా అన్నానని—మా తమ్ముడు ట్యూషన్ చెబితే యిక చదివినట్టే', నిర్మల పకపక నవ్వింది. ఆ గది నిండ వేయి విద్యు








# బంగారు పంజరం

దీపాలు ఒక్కసారి వెలిగినట్లయినయ్. ఆమె అందాన్ని ఆస్వాదిస్తూ తన్మయుడయ్యాడు ప్రకాశ్.

ప్రకాశ్ పది గంటలకల్లా యూనివర్సిటీకి రిసెర్చి చెయ్యను వెళ్ళిపోతాడు. పెదవులపై చిరునవ్వు నాట్యమాడుతుంటే నిర్మల భర్తను కారు వరకు సాగనంపి, గేటు మలుపు తిరిగేంతవరకు నిల్చుని తిరిగి వస్తుంది.

అత్తగారికి పథ్యపు భోజనం సిద్ధం చేయించటం, మామగారికి మందులు సరిగా సమయానికి ఇవ్వటం, ఇల్లంతా సర్దటం, వంటావిడకు ఏయే వంటలు, ఫలహారాలు చేయాలో చెప్పటం, మధ్యాహ్నాలు ఏదైనా చదువుతూనో, కుడుతూనో కాలక్షేపం చేయటం—మాలతితో కబుర్లు చెప్పుకోవటం—సాయంత్రాలు కొద్దిసేపు తోటపని, అంటే గులాబి పొదలవద్ద పనిచేయటం, సాయంత్రము అందాల భరిణలా తయారై భర్త రాకకోసం వేచివుండటం, అలవాటైంది.

ప్రతిరోజు అంత సాఫీగా గడిచిపోదు. కొన్ని సార్లు అత్తగారికి బాగా జబ్బు చేస్తుంది. దాంతో ఆమె చనిపోతున్నానని నానా హంగామా చేస్తుంది. మాలతి విస్మయమైన దుఃఖం ఆ మాతృమూర్తి హృదయాన్ని కరిగించి వేస్తుంది. ఇంటిల్లిపాదీ దుఃఖసాగరంలో మునిగిపుంటారు. వీలైతే ప్రకాశ్ గూడ ఆమె దగ్గరే ఉంటాడు.

డాక్టర్ శాంత వచ్చి అందర్నీ గద్దించి కావలసిన ఇంజక్షన్స్ ఇచ్చి అందర్నీ ఓదార్చి, సరిగా ఆహారం తీసుకోనందుకు కామోసు మందలించి వెళ్తుంది. ఇలా నెలకో రెండు మూడుసార్లు జరుగుతుంది. మొదట్లో నిర్మల యెంతో గాభరా పడింది. గానీ తర్వాత అలవాటైంది. కానీ ఆమె ఇలాంటి పరిస్థితిలో డాక్టరు శాంత కోసం వేయి కళ్లతో వేచిఉంటుంది. ఆమె వచ్చి వెళ్తేనే నిర్మల హృదయం తేలిక పడ్డట్లయ్యేది. మేఘావృతమైన ఆకాశంలో సూర్యకిరణాలు దూసుకు వచ్చినట్లయ్యేది. ఆమె చూపే జాలి, వాత్సల్యానికి నిర్మల లోలోపలే జోహారు లర్పించే దామెకు.

* * *

ముందువైపు కళ్లాపు జల్లుతున్న నరసు, కుచ్చెళ్లు నెత్తి పట్టుకుని ఇంట్లోకి పరుగెత్తి సావిత్రమ్మ గది గుమ్మం దగ్గ రాగిపోయింది. వగర్చుతూ నించున్న నరసును చూచిం దామె. "ఎంత జెప్పినా వినవ్. ఏమిటా హడావిడి ....?"

ఆమె మాటలు కద్దు వస్తూ "మీ వదినెగారు రిక్షాలో వస్తున్నారు" అంది. అంతలోపలే "వదినా —అన్నయ్యా" అన్న పిలుపు నలుమూలల ధ్వనించింది.

సావిత్రమ్మ ఆశ్చర్యపోయింది. గబగబ బయటికొస్తూ వదినను చూచి అంది: "అదేమి టొదినా— చెప్పే చెయ్యకుండా, ఓ కార్డు ముక్కైనా వ్రాయకుండా యిలా ఒంటరిగా వచ్చావు ?"

ఆమె హడావిడిగా వచ్చి సోఫాలో చతికిలబడింది, "అన్నయ్యేడీ ?" అంది ముఖం చిట్లించుకుని.

# బంగారు పంజరం

సావిత్రమ్మ యెవళ్లకైనా భయపడితే ఒక్క వదినెకే భయపడాలి. ఎప్పు డొచ్చినా యేదో ఒక తగవేసుకోందే కదల్దు. గిల్లి కజ్జా లేసుకుని, దాన్ని పెంచి పెద్దజేసి, పూలు పూయించి కాయలు కాయిస్తుంది. ఆమె రాకంటే యింటిల్లిపాదికీ భయమే. చిన్నపిల్లగా ఉన్నప్పటినించీ నరసు గూడ చూస్తూనే ఉంది. అందుకే అంతగా లోకం మునిగిపోతున్నట్టు పరుగెత్తుకొచ్చింది.

ఆమె ధోరణి సావిత్రమ్మకు నచ్చలేదు. ఎప్పుడో గాని సినిమా చూడని నరసు రాబోయే రసవత్తర ఘట్టాన్ని చూచి ఆనందించే నిమిత్తం తెరచాటున గుమ్మంలో నించుంది.

"ఒసేయ్ నీకేం పనే యిక్కడ" అందామె. నరసు మరిక తిరిగి చూడకుండా కాళ్లకు బుద్ధి చెప్పింది.

సావిత్రమ్మ ప్రక్కన కూచుంటూ అంది: "నిద్రపోతున్నారు. ఐనా అంత తొందరేం. ముఖం కడుక్కుని కాఫీ త్రాగాక అన్నీ మాట్లాడుకుందాంలే—రా" చేయి పుచ్చుకుని లేపుతూ.

ముందు ఆత్మారాముని సంతృప్తి పరచాకనే అన్ని పనులూ సమర్థతతో నిర్వహించగలామె వదినకంటే ముందుగానే గబగబ పెరటివేపు కెళ్లింది. నిర్మల అప్పుడే పెరట్లోంచి వస్తోంది.

తన కెదురుగా వచ్చిన స్త్రీని చూచి నిర్మల స్థంభించిపోయింది, క్షణంతాళి తెప్పరిల్లి పూలసజ్జ అరుగుమీదుంచి ఆమెకు నమ్రతతో నమస్కరిస్తూ అంది మెల్లగా "ఎప్పుడొచ్చారు పిన్నీ."

ఆమె మాట్లాడలేదు. సాలోచనంగా చూచింది. ఆ చూపును ఎదుర్కోలేక నిర్మల వెనక నించున్న అత్తగార్ని చూస్తూండిపోయింది.

సావిత్రమ్మ వదినెను స్నానాలగది వైపుకు తీసుకెళ్లింది. బ్రతుకుజీవుడా—అన్నట్లు నిర్మల గబగబ లోపలి కెళ్లింది. తనకు తెలుసు ఆమె హృదయంలోని కోపం చితాగ్నియై కాళ్లలోంచి నాలుకలు చాచుతూ బహుర్గత మవటం—తనేం జేసింది ? ఆమె కెందుకు తనంటే అంత హేయభావం?

వచ్చి వచ్చి యీరోజే రావాలా ? తన సంతోషం సిద్ధించింది. పౌర్ణమి చంద్రబింబంలా పరిపూర్ణత చెందింది. కానీ ఆమెను చూడటంతో నిర్మల హృదయం అసంతృప్తి, భయంతో నిండిపోయింది. భయవిహ్వలయై, పాలిపోయిన ముఖంతో భర్త దగ్గర కెళ్లింది. ఆమెకు శాంతి లభించే చోటదే.

దొంగనిద్ర పోతున్న ప్రకాశ్ నిర్మలను చాటుగా చూచాడు. ఆమె గమనించే స్థితిలో లేదు. జారుగా వేసుకున్న ముడి నుంచి కారుతున్న నీటిబొట్లు ప్రకాశ్‌పై బడుతూ గిలిగింతలు పెట్టాయి. నల్లటి కురుల్లో యిరుక్కుపోయి, విడిగా ఉన్న సన్నజాజులక్కడక్కడ, అమావాస్యనాటి నక్షత్రాల్లా మెరుస్తున్నాయి. ఆ సుప్రభాతంలో సన్నజాజుల సౌరభం, పన్నీరు జల్లులా కురుల నించి కారుతున్న నీరు, ఆమె స్పర్శ, ఆతని నటనను వోడించినై. అమాంతంగా కూచుని ఆమె చుట్టూ చేతులు వేసి తలలోని సన్నజాజులను మత్తుగా ఆఘ్రాణించాడు.

నిర్మల యీ హఠాత్సంఘటన కులిక్కిపడింది. చిన్నగా నవ్వుతూ భర్త ముఖంలోకి సూటిగా చూచింది. ఆమె ముఖంలో యెదురుగా, ప్రస్ఫుటంగా అగుపిస్తున్న భయాందోళలను అతన్ని వివశునిగా జేసినై. నిశ్చలంగా ఆమెవైపు చూచి తర్వాత దగ్గరగా తీసుకుంటూ అడిగాడు "నీమూ—అలా ఉన్నావేం ?"

ఆమె భారంగా కళ్ళు మూసుకుంది. ఆమె ముంగురులను లాలనగా సవరిస్తూ జవాబుకోసం నిరీక్షిస్తున్నాడు.

"మీ అత్తయ్య—అంటే మావయ్యగారి చెల్లి యిప్పుడే వచ్చారు."

"ఐతే నీకెందు కంత గాభరా ?"

"ఏమో—భయంగా ఉంది—ఎప్పుడూ యింత భీరువునై పోలేదు. నావైపెంతో కఠినంగా—క్రూరంగా జూచింది. ఆ చూపులు—శిలలనైన ద్రవించేస్తాయండి" నిర్మల ఆగి ఆగి నెమ్మదిగా అంది.

ప్రకాశ్ మందహాసం చేశాడు. "అలా లేనిపోని బాధలు హృదయంలోకి రానివ్వకు. రానిచ్చావంటే మనశ్శాంతి దూరమవుతుంది. నీవలా ఉంటే నా కెలా ఉంటుందో చెప్పక్కర్లేదు. అవునా ?"

"మీ సంగతి నాకు తెలియదేమిటి—ఐనా ఆమె యివ్వాళే యెందుకు రావాలి ? ఇంకొన్నాళ్ల తాలి రాకూడదూ ?"

"ఇంకొన్నాళ్లయినా మనకు అది అసందర్భంగానే ఉంటుంది—ఏమంటావ్" బుగ్గను గిల్లి అన్నాడు. నిర్మల నవ్వింది.

"నీ నవ్వు చూస్తూ అలా ఉండి పొమ్మంటే నాకు కావలసింది ఇంకేంలేదు.

"ఆ .... హా .... నిజమే .... కొంచేంసేపైతే .... నిర్మలా ఆకలి .... త్వరగా పెట్టమను .... కాఫీ .... " అంటూ నిర్మల, తేలికబడ్డ హృదయంతో క్రిందికి దిగి వెళ్లిపోయింది.

ప్రకాశ్ క్రిందికి దిగి వచ్చేవేళకి అందరూ కాఫీ త్రాగుతూ హాల్లో కూర్చున్నారు. ఆ హాలు మాలతి గది ప్రక్కన ఉంది. కిటికీలన్నీ తోట వైపు కుంటాయి. ఆ గదిలో సాధారణ, కుటుంబ సమావేశా లౌతుంటాయి. ప్రాతఃకాల ప్రశాంత వాతావరణాన్నంతా పొందుపరుచుకున్న ట్లుంటుంది ఆ గది. లేత్రబాయపు కిరణాలు మందమారుతంతో ఏకమై ఆ గది నలుమూలలా వ్యాపిస్తాయి.

"ఎన్నాళ్ల కెన్నాళ్లకి దర్శనం" అంటూ లోపలికెళ్లాడు ప్రకాశ్.

"నీ దర్శనమే అపురూపమైంది. వచ్చి అరగంట కావస్తోంది యిప్పుడటోయ్ వచ్చేది !"

"అత్తగా రెదురుగా రావటమంటే ముస్తాబై రావాలన్నమాట."

"ఇప్పు డెందుకూ .... ఐనా నీకు మేం కనిపిస్తామా!"

అంతటితో సంభాషణ నిల్చిపోయింది. ప్రకాశ్ తండ్రి రాజారావుగా రన్నారు "ఇంతకు వచ్చిన సంగతి చెప్పలేదమ్మాయ్ !"

"నీ దగ్గరకు రావాలంటే యేదైనా సంగతే ఉండాలన్నమాట !" కొద్దిగా గట్టిగా అందామె.

"నీతో వచ్చిన చిక్కే యిది. మరి హాటాత్తుగా వూడిపడ్డావ్ కారణం లేందే రాలేవి."

"అంతేలే. కోపంతో అన్నా గానీ, పెద్ద చిక్కే వచ్చింది. మావ మర్యాదను మంట గలిపే సమయం



# చురుకైన గృహిణులకు టినోపాల్ మాత్రమే దుస్తులను మరింత తెల్లగా చేస్తుందని తెలియును




ప్రతి గృహిణి పొరుగింటి ఆమె కంటె సొగసుగా బట్టలు వేసుకోవాలనుకొంటుంది. తెల్లని దుస్తుల మాటవస్తే ఆమె టినోపాల్‌ను మాత్రమే జ్ఞాపకము పెట్టుకొంటుంది. ఎందుకంటె, టినోపాల్ ఒక్కటే తెల్లని బట్టలను మెరిసేలా మరియు ఎక్కువ తెల్లగా చేస్తుంది.

టినోపాల్ పొదుపు చేకూరుస్తుంది కూడా మామూలు కుటుంబంలో ఒక రోజు ఉతుక్కునే బట్టలకు టీ చెంచాలో నాలుగోవంతు టినోపాల్ చాలు. ఒకసారి టినోపాల్ పెట్టి ఉతికిన దుస్తులు తరువాత 3 లేక 4 సార్లు ఉతుకుకొన్నా ఎక్కువ తెల్లగానే ఉంటాయి.

జ్ఞాపకముంచుకోండి –

కొంచెము

## టినోపాల్

తెల్లని దుస్తులను అన్నిటికన్న తెల్లగా చేయును

టినోపాల్ జె. ఆర్. గెయిగి, ఎస్. ఎ. బాల్, స్విట్జర్లెండ్ వారి రిజిస్టరు చేయబడిన ట్రేడు మార్కు.





ఉత్పత్తిదారులు :
సుహృద్ గైగి లిమిటెడ్ వడి వాడి, బరోడా

సోల్ డిస్ట్రిబ్యూటర్లు:
సుహృద్ గైగి ట్రేడింగ్ లిమిటెడ్ పోస్టు బాక్సు 965, బొంబాయి-1 బి.ఆర్.

TEL SISTA'S-SG-171 A

—అంతా వచ్చింది. నీ మూలాన, నీ భార్య మూలాన నీ కొడుకు మూలాన, ఆ రుక్మిణి మూలాన ..... ఇంకా యీ యింట్లోవా రందరూను .... నన్ను నా పిల్లన్నీ అన్యాయం చేశారు .... '' ఆమె కంఠం దుఃఖంతో బొంగురు పోయింది.

"ఇప్పు డిదంతా యెందుకూ—పాఠం ఒప్ప గిస్తున్నావు. త్వరగా చెప్పు.'' రాజారావుగారు విసుగ్గా అన్నారు.

"ఏం జెప్పనూ—అది లేదూ, నా కడుపున చెడ బుట్టింది. ఛీ—ఛీ .... దాని క్లాసుమేట్ అట మధుకర్‌రెడ్డి అట—వాడితో వెళ్లిపోయింది. అన లేను గానీ .... లేచిపోయింది .... ఎం తప్రతిష్ఠ! పైగా రాస్తుందీ .... 'మీరు, మా కాబోయే అత్త వాళ్లు కూడబలుక్కుని పెళ్లి చేస్తారా సరే, లేక పోతే రిజిస్ట్రారు పెళ్లి జేసుకుంటాము.'' అని. ఆమె నెత్తి బాదుకుంటూ భోరున ఏడుస్తోంది.

ఇలాంటి దుస్సంఘటన మాహించనైనా వూహించని అక్కడివారంతా విస్తుపోయి చూస్తు న్నారు. వోట్లో వేలు పెడితే కొరకలేని వసుధ అలాంటిపని చేసిందంటే చెప్పలేనంత ఆశ్చర్యం వేస్తోంది వాళ్లకి. రాజారావుగారు కిటికీలోంచి బయ టికి చూస్తూండిపోయారు. ఆ నిశ్శబ్దాన్ని భంగ పరుస్తూ ప్రకాశ్ అడిగాడు వాళ్లెక్కడున్నారని.

"ఇక్కడే ఉన్నట్టు అడ్రస్ ద్వారా తెలిసింది. మే మిద్దరం ఆలోచించి 'సరే' అంటే వస్తుంది—ఆ తర్వాత నాలుగు తన్ని గదిలోబెట్టి తాళంవేసి, యెవళ్లకో కట్టిపెట్టొచ్చనుకుని—వైర్ యిస్తే ఇచ్చిందేతిరిగొచ్చింది...ఆయనేమో వాడి అమ్మా నాన్న దగ్గరికి కాకినాడ కెళ్లారు .... నే నిలా వచ్చాను .... దాన్ని వెదికి తీసుకురావటం నీవంతు.'' ఆజ్ఞ జారీ చేసింది.

"ఎక్కడని వెదకాలి ?'' రాజారావుగారు సాలోచనగా అన్నారు.

"నన్నడుగుతావూ .... వస్తువు బోతే యింట్లో యెల్లా వెదుకుతామో అల్లా వెదికి పట్రా'' అంది కోపంతో.

"అత్తయ్యా ఆ పిల్లాడి తండ్రిపే రేమిటి ?'' ప్రకాశ్ అడిగాడు.

"సుబ్బారెడ్డి .... పెద్ద 'ఫారం' ఉంది.....''

"అరె—వారా .... నాకు తెలును .... సుబ్బా రెడ్డిగారి పెద్ద కొడుకు నాతోపాటు యిక్కడే చదివాడు .... చాల మంచి కుటుంబం ....''

ఆమె కంట నిప్పులు గ్రక్కింది "అంటే నీ అభి ప్రాయం ఆ కుటుంబం మంచిది, వసుధ ఆ యింటి కోడలైతే మరీ మంచిదనేనా ?''

"ఔను'' అన్నాడు నవ్వుతూ.

"ఛట్.... నేను బ్రతికుండగా అలా జరగ నిస్తానా ....ఏంఅన్నాయ్ అలా కొడుకుచేత వాగిస్తూ'' నువ్వేమో అలా బుద్ధునిలా కూచున్నావు .... అన్నవైపు తిరిగి భగ్గుమంది.

"అమ్మాయ్. చేయిజారి పోయింది పిల్ల. ఇప్పుడు తెచ్చినా పెళ్లెవరు జేసుకుంటారు ? ఇప్పటికే అంద రికీ తెలిసిపో యిందాలి. అందులో బావగారంటే అంగ్గుకీ తెలుసయ్యె.''

"తియ్యో .... అయ్యో .... ఇలాగేనా మాట్లా డటం ? ఏదో పిల్లను తెస్తానని, అన్నయ్యవని పరుగెట్టుకొచ్చానా ! బాబోయ్ యికేముంది ....''

# బంగారుపంజరం

ఏడుపు ప్రారంభించిం దామె.

"మీరు మాట్లాడకండి'' సావిత్రమ్మ నెమ్మ దిగా భర్తతో అంది.

"అవుదినా. నీమాట వినే మా అన్నయ్య మా కన్యాయం జేశాడు. మా అన్నయ్యను బాగా ఆడిస్తున్నావు. తేనె పలుకులు పలికి కొంగుతో కట్టేశావు .... ఆ నిర్మలను తెచ్చుకున్నావు .....''

"ఇక చాలుగానీ .... పెద్దవాడ్ని నామాట విను. పెళ్లయ్యాక వస్తారు. ఎంతకాలం భీష్మించు కుంటావు ? ఏడాది తిరక్కముందే అంతా మర్చి పోతావు. వసుధను కాదనటానికి పదివుంది ఆడ పిల్లలు లేరుగా ? ఒక్కగా నొక్కత్తి. ఈ కాలంలో అలాంటి పెళ్లిళ్లు మామూలే .... క్షమించేసి అంతా మర్చిపోటం ఉత్తమం ....''

"అరె బాబోయ్ .... ఎంతమాట ? అయినా మీకేం దెలుస్తుంది నా బాధ. నీ యింట్లో జరిగితే నీ కడుపులో చిచ్చుగానీ, నెమలి కంటినీరు జాలి వేటకాని కేం జాలి ? ....''

రాజారావుగారు కండువ విదిలించుకుని భుజం

ఆమె: వంకాయలు ఎలా ఇస్తా వబ్బీ.

దుకాణదారు: తక్కెడతో తూచి యిస్తానమ్మా!

సత్యం (మద్రాస్.)

మీద వేసుకున్నారు. "ఏదీ ఆ మొదటి అడ్రస్ .... వెళ్తున్నా ....''

కొంగుముడి విప్పి చిన్న కాగిత మిచ్చింది. రాజా రావు అది తీసుకుని కార్లో వెళ్లిపోయాడు.

"ఐతే అత్తయ్యా—మావయ్య నెందుకు కాకి నాడ పంపింది ?'' ప్రకాశ్ అడిగాడు.

"ఎందుకేమిటి—అక్కడ వాళ్లింట్లో పెళ్లి చేసుకుని వెళ్లారేమో అని. ఆయ నెంతకూ ఒప్పుకోలేదు. నేనే పంపించాను.''

"మరి వదినా, మీ అన్నయ్యను నే నాడిస్తున్నా నంటావే—మా అన్నయ్యను మటుకు నువ్వాడించటం లేదూ ? రామచంద్రపురానికి వద్దంటున్నకొద్దీ లాక్కెళ్లలేదూ ? ....''

"అమ్మా .... ఊరుకో'' అన్నాడు ప్రకాశ్ గుమ్మంవైపు దృష్టి పోనిస్తూ. నన్నజాజి మాలను పట్టుకుని నిర్మల వస్తోంది. ఆమె గది లోకి రావటంతో గదంతా ఆ పువ్వుల పరిమళంతో నిండిపోయింది. అందరూ వెనుదిరిగి ఆమెను చూచారు.

నిర్మల అందరి కళ్లల్లో పూలుపెట్టి పోయింది. ఆమె వెళ్లిన దిక్కు చూరచూర చూస్తూండిపోయిం దామె. ఇంతసేపు మౌనంగా కూచున్న మాలతి అత్తయ్య—దృష్టి మరల్చేం దుకు ప్రయత్నపూర్వకంగా అంది "అత్తయ్యా... వసుధ పెళ్లి చేసుకోలేదనుకో—నాన్న తెస్తా రనుకో— .... ఎవళ్లకో పెళ్లి చేస్తాను. ఆ అబ్బాయికి కొన్నాళ్లకి వసుధ సంగతి తెలుస్తుంది. దాంతో వాళ్ల కాపురం నాశనమవుతుంది. అంత కంటే ఇది మేలుకాదూ ? ''

"సరి .... సరి .... మొదలెట్టావ్ నువ్వునూ ... ఇంత చదువులు చదివారు .... మీ కేం తెలును కుటుంబ గౌరవం సంగతి ? మీరంతా ఒక్కమాట ఎలా మాట్లాడుతున్నారు?''

"అదేవిటత్తయ్యా .... హైదరాబాద్‌లో యిలాంటి పెళ్లిళ్లు లెక్కలేదు. మొన్న మా లెక్చరర్ ఒక అమెరికన్‌అమ్మాయిని చేసుకుని తీసుకొచ్చాడు. రేపు ఇంకోపెళ్లంది. ఒక పంజాబీ అబ్బాయి మన ఆంధ్రుల పిల్లను చేసుకోబోతు న్నాడు. మనవాళ్లు ఏం లేనివారుకారు. ఆ పిల్ల ఓ జడ్జీ కూతురు. మా లెక్చరర్ అన్నానే అతను లక్షాధికారి. మనసు, మనసు కలిసి ప్రేమించు కుంటే పెళ్లయిపోతుంది. ఇక దాన్లో తప్పే ముంది ?'' అన్నాడు ప్రకాష్.

"అవును తప్పేముంది ?'' మాలతి వత్తించింది.

"తప్పేమిటి ? అంతా తప్పే .... అనాదిగా వస్తున్న ....''

"అరె బాబూ .... ఆ .... అనాదిగా వస్తున్న దురలవాట్లను, ఆచారాలను, కట్టుబాట్లను మన సంఘ సంస్కర్తలు సంస్కరించి లోక—కళ్యాణం కోసం పాటుబడలేదూ ? వా రంత కృషి చేసినా ఇంకా మనం పాతవాటిని పట్టుకుని ఊగిసలాడు తున్నాము .... ''

ప్రకాష్ ఉద్రేకంతో ఇంకా చెప్పుకుపోయే వాడే గాని గబుక్కున అత్తయ్య లేవటంతో మాటలు ఆపేశాడు.

"సరే .... మీ అభిప్రాయాలు—నావి ఒకటి గావు. వసు నీ భార్య కాలేదే—అని కుమిలిపోతున్న నామీద కొబ్బరికాయ పడింది. వసుధ పరాయిదై పోయింది. అది నీ భార్య అయిఉంటే ఇలా జరి గేదేం .... ? వ న్నిలా కూచోబెట్టి నీతులు గరిపే వారా ? వదినా .... ఈ పాపం నీ తలకు చుట్టు కుంటుంది. అంతే. నీవే చేశావు. నా బంగారు బొమ్మను కాదని పరాయి పిల్లను చేసుకున్నావు.... నాకిక పనిలేదు .... నీ గుమ్మం త్రొక్కితే ఒట్టు'' ఆమె లేచి గబగబ వెళ్లిపోతోంది.

"వదినా! భోంచేసి .... ''

"ఒక్క బొట్టు నీరు గూడా ముట్టను'' మెట్లు దిగి సామానైనా తీసుకోకుండా వెళ్తోంది.

ప్రకాశ్ ఆమె ననుసరించాడు. ఎంత బ్రతిమా లినా ఆమె వినలేదు.

గేటుదగ్గర కొచ్చేసరికి కార్లో వస్తున్న రాజా రావుగార్ని చూచి నిలబడిపోయింది.

కారాగింది.

"ఎక్కడి కమ్మాయ్?''

"వెదకలేక వచ్చేశావ్ .... నీ సాయం కోరటం నాబుద్ధి .... ''

"వరే లోపలికి పద .... ''

"నేను రాను.''

"చాలా ముఖ్యవిషయం ఉంది .... రా''

అంటూ కారు-తలుపు తెరచాడు. ప్రకాశ్ నవ్వాపుకుంటూ వెనుదిరిగాడు. కారు ఇంటిముందు ఆగింది.

"అసలు పెళ్లి చేసుకున్నారో, లేదో అని రిజిస్ట్రారాఫీసు కెళ్లాను. నిన్ననే పెళ్లయిపోయింది..."

"హా .... పెళ్లి చేసేసుకుందీ....ఒక్క కూతురు .... కన్యాదానం జేసే పుణ్యం గూడ ...." భోరున ఏడ్చింది.

చెల్లివైపు జాలిగా చూచారు రాజారావు.

"రా లోపలికి. ఇంకా బోలెడు విషయాలున్నై."

లోపలి కొస్తున్న అన్నా చెల్లెండ్రను చూస్తూ గప్‌చిప్‌గా నించుంది సావిత్రమ్మ.

"వదినా! పెళ్లి చేసుకుందిట" అని సావిత్రమ్మను పట్టుకుని ఏడుస్తోంది. సావిత్రమ్మ హృదయం కరిగింది. అప్రయత్నంగా కన్నీరు కారింది.

"ఇది విను. ఆ ఆఫీసరు నాకు తెలుసులే. టాక్సీలో వచ్చి సంతకాలు చేశాక టాక్సీలోనే కాకినాడ కెళ్తున్నట్లు చెప్పారట. బావగారి కూతురనగానే ఎక్కడికి కెళ్తున్నారని అడిగాడట. వాళ నాన్నగారికి చాల జబ్బుగా ఉందని వారున్న హోటల్‌కు తంతి రాగానే పెళ్లి చేసుకుని వెళ్లారట."

"మీ కెలా తెలిసింది?"

"సుధాకర్ తంతి పట్టుకుని బిగ్గరగా చదివి ఏడ్చేశాడట. అక్కడున్న బోయ్ విని చెప్పాడు. ఇంగ్లీష్ అర్థంకాదుగా—వసుధ నడిగాడట—బాబుగా రెందు కేడుస్తున్నారని."

"పాపం" అన్నాడు ప్రకాష్.

"అయిందేదో అయిపోయింది. రాత్రి బండికి వెడతాను." ఆమెలోని కోపం, ఉద్రేకం, ఎటు పోయాయో. మాట్లాడకుండా సోఫాలో కూచుని కొంగు ముఖాని కడ్డం పెట్టుకుని ఏడుస్తూండి పోయింది.

సావిత్రమ్మ మనస్సంతా వికలమైంది. స్టేషన్‌కు వదినను బండెక్కించటానికి వెళ్లిన భర్త, ప్రకాశ్‌ల కోసం ఎదురు చూస్తోంది. ఆమె ఏదో తప్పుచేసిన దానిలా బాధపడుతూ కుమిలి పోతోంది.

"అమ్మగారూ! భోజనానికి రమ్మంటున్నారు. ఆలస్యమైందంటున్నారు చిన్నమ్మగారు" నరసు చెబుతుంటే పరధ్యాన్నంగా వింది.

"భోజనానికి రండమ్మగారూ" అంది నరసు.

సావిత్రమ్మ కర్థమైంది. "నాకొద్దు. వాళ్లిద్దర్నీ భోంచెయ్యమను" అంది చికాకుగా. నరసు వెనుదిరిగి పోయింది.

కాసేపటికి నిర్మలొచ్చి పిల్చింది. సావిత్రమ్మకు నిజంగా చికాకుగా ఉంది. మనస్సేమీ బాగులేదు. నిజంగానే ఈ పాపం తనకు చుట్టుకుంది.

"నాకొద్దు. మీ రిద్దరు కానివ్వండి."

నిర్మల వెళ్లలేదు. "కొద్దిగా తీసుకోండే. నీరసపడిపోతారు. పోనీ పాలు, పండ్లు......"

"అమ్మాయ్—నిర్మలా—నీకే చెబుతుంట—నా కేం అక్కర్లేదు ...." గొంతు హెచ్చించి అందామె.

నిర్మల స్తంభించిపోయింది. కాపురాని కొచ్చిం దగ్గర్నుంచి ఎప్పుడు గూడ ఒక్కమాట కఠినంగా లనని అత్తగారిలా అనేసరికి నిజంగానే భయంవేసింది. కానీ తన విధి నెరవేర్చాలి. అసలే డయాబిటిస్ మనిషి. కాసే పలానే నించుంది.

కోడలు వెళ్లలేదని గమనించి ముఖం చిట్లించి అంది సావిత్రమ్మ "నువ్వెళ్లిక!"

"నాకు తెలుసు మీ కెంతో బాధగా ఉందని. మీరు భోంచెయ్యలేదని తెలిస్తే మామయ్యా, వారూ ఎంతో ఆందోళనపడ్తారు. మే మిద్దరం గూడ తినలేము. ఒక్క ముద్ద తినండి ...."

సావిత్రమ్మ ముఖం కోపంతో కందగడ్డయింది. మారు మాట్లాడకుండా లేచి, తన మంచంమీది కెళ్లి పడుకుంది.

నిర్మల మనసు చివుక్కుమంది; కీడును శంకిస్తోంది. మాలతికి వడ్డించి తనొక గ్లాసెడు మజ్జిగ త్రాగి, మాలతి గదిలో యేదో పుస్తకం పట్టుకుని కూచుంది.

మాలతి వదిన చర్యలను గమనిస్తోంది. ఏదో ఉందని తెలుసు గానీ మౌనం వహించింది.

వాళ్ళు బండెక్కించి స్టేషన్‌నుంచి వచ్చేసరికి తొమ్మిదైంది. మాలతి నిద్రపోయింది. ఆమె కాటంకం కలక్కుండా పెద్ద లైటు ఆర్పేసి చిన్న బల్బు ఆన్ చేసి సోఫాలో పడుకుని ఆలోచిస్తోంది. వాళ్లిద్దరూ రావటం శబ్దం విన్నది గానీ ఎందుకో వెంటనే లేచి మేడమీది కెళ్లలేకపోయింది. అలానే కళ్లుమూసుకుని పడుకుంది. మనస్సు స్థిమిత పర్చుకున్నాక గానీ వెళ్లగూడ దనుకుంది. ఎంత ప్రయత్నించినా ఆమెలోని భయం జడలు విప్పుకుంటుందే గాని అణగిపోవటంలేదు. నెమ్మదిగా లేచి మాలతి తలవైపు మున్న స్టూలుమీద కూచుంది. అక్కడినుంచి వెన్నెల రాత్రి కావటం వల్ల తోటంతా యెంతో అందంగా కిటికీలోంచి అగుపిస్తోంది. పిండి ఆరబోసినట్లున్నశీత కిరణాలు. పిల్లగాలులు మెల్లగా వీస్తూ ఆమె హృదయంలోకి అమృతాన్ని తెస్తున్నట్లుంది. ప్రశాంతమైన వాతావరణం, అప్పుడప్పుడు ఆకుల సవ్వడి, ఎండుటాకుల గలగల ధ్వని, పిట్టల కిచకిచలు. అంతకు తప్ప ఆ నిశ్చలమైన రాత్రిలో యే యితర సందడి లేదు.

మాలతి గడియారం, సంగీత ధ్వనితో పది గంటలు కొట్టింది. అంతా నిశ్శబ్దంగా ఉంది. నిర్మల హృదయం నిర్మలమైంది. వెళ్లటాని కుద్యుక్తురాలైంది.

"ఇక్కడికి తీసుకొచ్చావేం" ఎవరో మాట్లాడుతున్నారు. నిర్మల భయంతో కుంచించుకుపోయింది. ఎవరిస్వరమో ఆనవాలు పట్టకోలేకపోయింది. కిటికీలోంచి చూచింది. ఎవ్వరూ అగుపించలేదు. మళ్లీ ఏవో అస్పష్టమైన మాటలు విన్పించాయి. ఆ గది చివరనున్న పెద్ద కిటికీని సమీపించి చూచింది.

ఆ కిటికీ క్రిందనున్న బెంచిమీద యిద్దరు వ్యక్తులు కూచుని ఉన్నారు. వెన్నెల వారిమీద పడకపోయినా వా రిద్దరు అత్త మామలని వెంటనే హించింది. వెళ్లిపోవా లనుకుంది. గానీ ఏదో అగోచరమైన శక్తి ఆమె నా కిటికీ చువ్వలకు కట్టివేసింది. చువ్వ పట్టుకుని అలాగే వారికి కనిపించ

# బంగారు పంజరం

కుండా వింటుంది.

అత్తయ్య ఏడుస్తోంది. నిర్మల గుండె దడ లాడింది.

"ఎందు కేడుస్తావ్. ఊరుకో" రాజారావు రంటున్నారు.

"పాపిష్టిదాన్ని. నా హృదయం మీవయిందు సు కొండే ఉండలేను. వదినె చూచారా. ఎప్పుడ భగ్గున మండుతూన్న అగ్నిపర్వతంలా గుబగు లాడేది. ఈవేళ చప్పబడిపోయినలా వెళ్ళిపోయిం తనన్నట్లు ఆ పాపం నాకే చుట్టుకుంటుం వసుధను ప్రకాశ్ ...."

"ఇప్పు డెందుకట యిదంతా. కాలేదు. అం జరిగివుంటే—అయివుంటే, యిలాంటి వనుకు శాంతిని పోగొట్టుకోకు. అలా జరగాలనుం జరిగింది ......"

"అంత తేలికగా తోసిపారెయ్యలేను. నా తెలుసు మీ హృదయంలోని క్షోభ. పైపైకి అ అంటున్నారు. ఇదంతా నేను చేసిన తప్పు. యిద్దరికీ మనఃశ్శాంతి లేకుండా జేశాను. అ చెల్లెండ్ర నిలా చేశాను. ఎంతో తప్పు చేశాను నన్ను క్షమించండి. ఇలా జరిగిందంటే దానికి బాధ రాల్ని నేను. రుక్మిణి మాటలు విన్నాను. ఆల విన్నంటే వను ఖ్యాతే యెంత బావుండే దని స్తోంది. చక్కని బొమ్మ, తెలివిగలది, కట్న కాను లతో మనల్ని తృప్తిపర్చేదేగా వదిన .... నే నెంత పశ్చాత్తాప పడుతున్నాను. మీ రర్థం చేసుకోండి .... మీకు నే నెంతో ......

"అబ్బ .... ఎందు కలా మాట్లాడుతావ్. నిర్మల కేం తక్కువని అలా నిస్పృహగా మాట్లాడుతావు? నిశ్చలంగా ఉన్న నీట్లో మట్టిబెడ్డ పడింది. నీరంతా బురదతో మలినమైంది. మళ్ళీ రెండు రోజుల కంతా, నీ లెఖ్ఖప్రకారం నిర్మల మవుతుంది. అంతేగా. మరి రెండ్రోజులకంతా సవ్యంగా మన దినచర్య నడుస్తుంది."

నిర్మల హృదయా న్నెవరో నలిపినట్లయింది. ఏది జరుగుతుందని యింతకాలం భయపడు తున్నదో ఆ సంఘటన జరిగింది. ఇకమీదట తను అత్తగారి ప్రేమకు పాత్రురాలు కాదు. కొన్నా ళ్లకు తనా కుటుంబంలో ఒక అజ్ఞాత వ్యక్తిగా ఉండాలి. ఆమె ప్రాణం సొలిపోయింది. ఇంతవరకు విన్నది. ఇక వినలేక నెమ్మదిగా అడుగు లేసు కుంటూ అతి కష్టంతో మేడమీది కెళ్ళిపోయింది.

భర్త నిశ్చింతగా పసిపాపలా నిద్రపోతున్నాడు. భర్త ముఖాన్ని చూస్తూ, లభించని శాంతికోసం పెనుగులాడుతోంది.

"నిజమే. అంతా పైపైకి మాత్రమే. మీ రెంతో కుమిలిపోతున్నారని నాకు తెలుసు.. చేయి జారి పోయింది. గానీ నే నెంతగా బాధపడ్తున్నానో గ్రహించండి. మీ యింటి కోడలినై మీ ఇంటికి కళంకం తెచ్చాను ...."

రాజారావు గబుక్కున ఆమె మాటల కడ్డు వచ్చారు.

"సరే .... అంతా అర్థమవుతోంది గాని సావిత్రీ—ఒక్కమాట యింతవరకు నే నెవ్వరికీ చెప్పలేదు .... నీతోగూడ చెప్పలేదు." చేతులు కట్టుకుని మంచుకొండల్ని బోలిన మేఘాలను చూస్తూ అన్నారు.

సావిత్రమ్మ నిర్ఘాంతపోయింది. ఏదో పెద్ద విషయమైతేనే గాని, గంభీరంగా చెప్పదలిస్తేగాని రాజారావు ఆమెను సావిత్రీ అని సంబోధించడు. పెద్ద సమస్యలను గూర్చి, సుఖదుఃఖాలను గూర్చి ఆమెతో చర్చించ నిచ్ఛగించినప్పుడు గూడ సావిత్రీ అంటారు. ఆమె మాట్లాడలేదు. భర్త ముఖంలోకి నిరీక్షణతో చూస్తోంది.

"నీమీద నాకేం కోపంలేదు. వసుధనే చేసుకోవా లనుకుంటే తప్పక అలా జరిగించేవాడిని. నీమాట నే నెప్పుడు కాదనకపోయినా వసుధ విషయంలో నా పట్టు విడిచేవాడిని కాదు..... నీ మాటలు విని, నిర్మలను గూర్చి రుక్మిణి చెప్పినదంతా విని ఒప్పుకున్నా ననుకుంటున్నారుకదూ మీరంతా .... లేదు సావిత్రీ .... ఎప్పట్నుంచో నా హృదయాంతర్భాగంలో మాటుబడిపోయిన ఒక అభిప్రాయానికి రూపకల్పన జరిగించాలా, వద్దా, అన్న ప్రశ్నలు రాగానే వద్దనే నిశ్చయించుకున్నాను. అంటే వసుధను కోడలిగా చేసుకోటం నా ప్రక్క అయిష్టమే అయినా మరోపావంక అయిష్టత. అయిష్టమే యెక్కువ. కట్న కానుకలతో, అంద చందాలతో, బుద్ధి కుశలతతో పనిలేదు. అకారణంగానే కొన్ని భావాలు స్థిరంగా నాటుకుపోతాయి హృదయంలో. ఆ భావాలు సరైనవి కావచ్చు. లేదా పూర్తిగా తప్పైనా అవ్వొచ్చు ...." రాజారావు గారు ఆపేశారు. సావిత్రమ్మ విస్తుపోయి చూస్తోంది. అయితే తప్పు తనది కాదన్నమాట. తనంతగా దుఃఖించ నవసరంలేదు. హృదయం తేలికబడింది.

"ఒక్కమాట .... ఎందుకని వద్దనుకున్నారు..."

రాజారావుగారెందుకో ఈ ప్రశ్నకు జవాబివ్వలేదు. నోరంతా యెండిన ట్లయిపోయింది, గొంతు నొప్పి యేదో బాధ. సూటిగా అతని గొంతులో బాణం దిగిపోయినట్లా బాధపడ్డాడు. అతి కష్టంతో అన్నారు.

"ఎందుకో .... చెప్పాగా, కొన్నింటికి కారణా లుండవని ..... ఇక రా వెడదాము ...."

నెమ్మదిగా అడుగు లేసుకుంటూ లోపలి కెళ్లారు. రాజారావు హృదయంలో తుఫాను రేగింది. మంచంమీద పడుకుని కళ్లు మూసుకున్నారే గాని ఎంతకూ నిద్ర రాలేదు.

(సశేషం)

**తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది!**





ఆల్ ఇండియా

# హాండీక్రాఫ్ట్స్ బోర్డ్

హస్తకళల అభివృద్ధి సమస్యలను, ప్రగతిని పరిశీలించడానికి 1952 వ సంవత్సరములో ఈ సంస్థ భారత ప్రభుత్వముచే స్థాపింపబడినది.

క్షీణించిపోయిన ఈ కళలను పునరుద్ధరించడానికీ, కొత్త పద్ధతులను ప్రవేశపెట్టడానికీ గడచిన పది సంవత్సరాలలో దేశములోని వివిధప్రాంతాలలో ఈ సంస్థ పైలట్ కేంద్రాలను నెలకొల్పింది. పాత నమూనాలను ఆధునిక అవసరాలకుతగినట్లు మలచడానికీ, కొత్త నమూనాలను ప్రవేశపెట్టడానికీ నాలుగు నమూనాకేంద్రాలను నెలకొల్పింది. ఉత్పత్తి కేంద్రాలు తర్ఫీదుకేంద్రాలుగా మార్చబడి ప్రజలకు అనేక హస్తకళలలో తర్ఫీదు ఇవ్వబడుతూంది. పనిముట్లతయారీ, ఉత్పత్తివిధానాలలో పరిశోధన జరుగుతూంది. కళాత్మకమైన మృణ్మయ పాత్రలతయారీకి పూర్వం ఉపయోగించిన వృక్ష సంబంధమైన రంగులను, మెరుపుసామగ్రిని తిరిగి ప్రవేశపెట్టడానికికూడా పరిశోధనలు జరుగుతున్నాయి. ఈసంస్థ వివిధ శాఖల సమన్వయ కృషిద్వారా హస్తకళాఖండాల విక్రయం దేశవ్యాప్తంగా అభివృద్ధి చెందింది. కళాఖండాల నాణ్యతను కంట్రోల్ చేసే పద్ధతి ప్రకారం భారతీయ హస్తకళా ఖండాల నాణ్యతకు పూచీ యివ్వబడుతూంది.

ఒక సమున్నత స్థానాన్ని సంతరించుకొన్న భారతీయ హస్త కళాఖండాలు మన మహత్తర సంప్రదాయానికి చిహ్నాలుగా భాసిస్తున్నాయి, విదేశీ మారక ద్రవ్యాన్ని కూడా ఇవి సంపాదిస్తున్నాయి.

DA 62/178

## భారతీయ హస్తకళాఖండాలను కొనండి

# న్యూఢిల్లీ లేఖ

11వ పేజీ తరువాయి

ప్రపంచ ప్రదర్శనానికి సంబంధించిన జమా ఖర్చులు, (ఆడిట్ చేసిన లెక్కలను) ఇంతవరకు సమాజ్ ప్రకటించనేలేకపోయింది. ఈ విషయం వెల్లడించి శ్రీ ఖన్నా, ప్రభుత్వం ఈ విషయాన్ని పరిశీలిస్తున్నదని అన్నారు.

అదంతా ఓ విషాద గాథ. ప్రధాని శ్రీ నెహ్రూ మంత్రివర్గంలో ఒకప్పుడు సహాయమంత్రిగా ఉన్న డా. పంజాబ్‌రావు దేశ్‌ముఖ్ ఈ సమాజ్‌కు అధ్యక్షులు. ఆయన మంత్రిగా ఉన్నప్పుడే ఈ ప్రదర్శనం జరిగింది. డా. దేశ్‌ముఖ్ ఇప్పుడుకూడా కాంగ్రెస్ సభ్యులే. ఇదేం పెద్ద క్లిష్ట సమస్య కాదు. భారతదేశంలోని అతి బీదస్థితిలో ఉన్న పన్ను చెల్లింపుదారులనుంచి వసూలు చేసిన ధనం అక్షరాలా ముప్ఫై రెండు లక్షల ఇరవైయ్యేడువేల ఎనిమిది వందల ఏభై మూడు రూపాయల — ధనం ఇంకా ఇంతవరకు ప్రభుత్వానికి ఎందుకు చెల్లించలేదనేదే ముఖ్యమైన ప్రశ్న? ఈ విషయాన్ని ప్రభుత్వం జాగ్రత్తగా పరిశీలిస్తున్నదని మంత్రి ప్రకటించినంత మాత్రాన సరిపోదు. బకాయి—ఈ గత మూడు సంవత్సరాల క్రిందటిది. తనకు రావలసినవి వసూలు చేసుకోటంలో ప్రభుత్వానికి శ్రద్ధ ఉండాలి. ఈ సొమ్ముపైన మూడేళ్ళకు లెక్క గడ్తే వచ్చే వడ్డీ కొంచెం అటూ, ఇటూ రు. 5 లక్షలుంటుంది. ఇది ఇంతటితో ఆగిపోలేదు.



## త్వరలో ప్రారంభం!

## 'డిటెక్టివ్ సీరియల్' కథ

వివరాలకై ఎదురుచూడండి!

## రచయితలకు విజ్ఞప్తి

రచయితలు తమ రచనలతోను, రేఖా చిత్రముల తోను, తగినన్ని తపాలా బిళ్ళలు అంటించి, చిరునామా వ్రాసిన కవర్లు జతచేసి పంప గోరుతాము. అట్లా పంపితేనే నిరాకరించిన రచనలను మరి కొంత త్వరగా త్రిప్పి పంపటం సాధ్యమవుతుంది.



## ఫిలిం స్టార్ లెదర్ సోల్ నైలాన్ ప్లాస్టిక్ పాదరక్షలు.

స్త్రీలకు, కాలేజీ విద్యార్థినులకు మిక్కిలి అందమైన డిజైనుల తోను, ఆకర్షణీయమైన రంగులలోను లభించును. కొలతలు పంపండి. ధర: స్పెషల్ రు 5/75. కాశ్మీర్ రు 7/25. పోస్టేజి రు 1/50 అదనం. ఏదైనా రెండు జతలు కొనువారికి పోస్టేజి ఉచితం. ప్రతి ఆర్డరుతో రు. 2/– అడ్వాన్సు పంపండి. తృప్తికరముగా లేనియెడల డబ్బు వాపసు చేయబడును. ఉత్తరాలు ఇంగ్లీషులో వ్రాయండి. వ్యాపార వివరాలకు వ్రాయండి.

ALANKAR TRADERS (APM)
Gandhi Bagh, Nagpur-2.

## నారసింహ లేహ్యం

బంగారు చేరినది. మేహము, నిస్సత్తువను హరించి వీర్యవృద్ధి, బలము, రక్తవృద్ధిని కలిగించును. 20తు.డబ్బీ రు. 3-50

## రోజాపుష్ప లేహ్యము

అజీర్ణం, గర్భవాతం, మలబద్ధకం హరించి చక్కగా విరేచనమును, జీర్ణశక్తిని కలిగించును. 15 తు. డబ్బీ రు. 1–4–0; పోస్టేజి రు. 1–1–0. మా క్యాటలాగు ఉచితం.

పి. సి. ఏ. అండ్ కో.,
ఆయుర్వేద సమాజం, పెరిదేపి, నెల్లూరుజిల్లా

---

## జ్వరచిహ్నాలు, ఫ్లూలనుంచి పూర్తిగా విముక్తి పొందండి

జ్వరచిహ్నాలతో వణకుగాను, అస్వస్థతగానువుందా? లేకపోతే ఫ్లూగాని వచ్చిందా? 'ఆస్ప్రో' వేసుకొని జ్వరాన్ని తగ్గించుకోండి. ప్రపంచంలో లక్షలాది మందికి కుటుంబ ఔషధం. 'ఆస్ప్రో' మీ శరీరంలో బాధిత భాగాల మీద నేరుగా పనిచేసి, సత్వర బాధ నివారణ కలిగిస్తుంది. ఇంటిల్లి పాది కోసం 'ఆస్ప్రో' దగ్గిర వుంచుకోండి.

# 'ఆస్ప్రో'

## ఇంటెల్ల పాదికీ






రోజా, ఊదారంగుగల పీలుచేసిన పట్టీ కావాలని అడగండి.

'ఆస్ప్రో' తీసుకోండి
తిరిగి నిజముగా స్వస్థత పొందండి

నికొలాస్ వారి (N) తయారు
నాణ్యతకు మరియు శుద్ధతకు మీకు గ్యారంటీ కలదు

---

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7, Thambuchetty Stree
Madras-1. Chief Editor: S. Sambhu Prasad.



నీటిబాతు నింగిచూపు

ఫొటో : ఏ. వి. వి. నరసింగరావు

**Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.**

# విఖ్యాత జ్యోతిశ్శాస్త్రవేత్తతో సంప్రదింపుడు

ఉగాదినాడు సామాన్య మధ్యమ తరగతి ప్రజల నుద్దేశించి నేను కావించిన ప్రకటన సర్వప్రజా మోదమునందిన దనుటకు నిరంతరము నాకు చేరుచున్న వందలాది ఉత్తరములే ప్రత్యక్ష సాక్ష్యం!



భారతదేశంలో గల ప్రఖ్యాత జ్యోతిశ్శాస్త్రజ్ఞులు సాధించని ఘనతర విజయములను సాధించినది ఈ మీ ఆంధ్రజ్యోతిశ్శాస్త్రవేత్తయే! నేను సాధించిన శత సంఖ్యాకశాస్త్ర విజయములలో మచ్చునకు కొన్నింటిని మాత్రము నేనిట పేర్కొనుచున్నాను: అవి యివి: (1) భారత స్వాతంత్ర్యము (2) పాకిస్థాన్ అవతరణ (3) శ్రీ నెహ్రూ ప్రధానమంత్రిత్వము (4) కాశ్మీర్‌లో భారత పాకిస్థాన్ల యుద్ధం (5) మహాత్మాగాంధీ-లియాకతాలీఖాన్ హత్యోదంతములు (7) జిన్నా, పటేల్, స్టాలిన్, టాగూర్, పంత్‌ల మరణ సమయములు (12) హైదరాబాద్, గోవాలపై భారత్ సైనిక చర్య (14) భాషారాష్ట్రములుగా భారత్ పునర్నిర్మాణము (15) ఆంధ్ర రాష్ట్ర నిర్మాణము (16) హైదరాబాదు రాజధానిగ విశాలాంధ్ర అవతరణము (17) పాకిస్థాన్‌లో అయూబ్‌ఖాన్ పాలన (18) కెనడి అమెరికా అధ్యక్షుడగుట (19) మాక్మిలన్ బ్రిటన్ ప్రధానియగుట (20) భారత భూభాగముపై కమ్యూనిస్టు చైనా కావించిన, కావించుచున్న దురాక్రమణ చర్య - ఇత్యాదులు.

ఉగాదినాడు సామాన్య మధ్యమ తరగతి ప్రజల నుద్దేశించి ప్రకటించిన పథకము క్రింద నేనతి స్వల్పకాలము మాత్రమే పని చేయ నిశ్చయించుకొంటిని. కనుక సద్భావముతో నా శాస్త్రసేవను పొందదలంచిన ప్రజలు త్వరపడ గోరుచున్నాను.

## రు 5 లకు మాత్రమే మీ పూర్తి జాతకం!

ఇందు మీ జీవితము మొత్తములో జరుగబోవు ముఖ్య ఫలితములను, అనగ (1) రూపము (2) స్వభావము (3) ధనసంపాదన (4) విద్య (5) భూమి (6) గృహము (7) సంతానము (8) శత్రు (9) రోగ (10) ఋణ (11) వివాహము (12) ఆయుర్దాయ (13) వృత్తి (14) ఉద్యోగం (15) వాణిజ్యము మొదలగు జీవిత ఫలితములు వ్రాసి పంపబడును.

రు **5** లు M.O. తో, మీ జాతకం జననకాల దశాశేషం, ఇవి లేనివారు జననవివరాలు పంపవలయును. ఈ జననవివరాలుఆధరముగా గొని రాశి, అంశ పత్రములు, జననకాలదశాశేషం తయారుచేయుటకు రు **2** లు అధనముగా ఛార్జీ చేయబడును. ఈ జననవివరాలు లేనివారు తమ చేతిముద్రలను తీసి పంపవచ్చును. రిజిష్టరులో తెప్పించుకొనదలచినవారు సదరు ఖర్చులు భరించాలి. వచ్చిన ఆర్డర్లు క్రమవరుసగా వ్రాసిపంపబడును. పోష్టుబిళ్లలు పంపనివారికి ప్రత్యుత్తరములు పంపబడవు వి.పి పద్ధతిలేదు

### ప్రొఫెసర్ కె. ఎస్. స్వామి

*గాంధీనగరం - తాలూకా ఎదుట,* పోష్టు బాక్సు నెం. 541, విజయవాడ-3.